

అన్నపూర్ణా వారి
చదువుకున్న అమ్మాయిలు
నిర్మాత
డి.మధుసూదన రావు B.A.
దర్శకుడు
ఆదుర్తి సుబ్బారావు
సంగీతం రాజేశ్వరరావు
శ్రీసారథీ స్టుడియోస్. హైదరాబాద్
నవయుగ విడుదల
n.o.k.r.

# దేశ రక్షణకై ఆయుధాలు
## ఎంత అవసరమో ఉత్పత్తి కూడా అంత అవసరమే!

## ఉత్తరాలు

### పోటీ వ్యాసాలు

"సినిమాలూ—జాతీయ సమైక్యతా" అను సినిమా పోటీల వ్యాసములు ఎంతో చక్కగా వ్రాయబడి మంచి భావార్థమును ప్రస్ఫుటము కావించుచున్నవి. వాటివలన నేటి సినిమాలు మన జాతీయ సమైక్యతకు ఎంతవరకు తోడ్పడుతున్న వను విషయము చక్కగా వ్యక్తమైనది. ఇట్టి వ్యాసములు రచించిన రచయితలకు, మరియు ప్రచురించిన సంపాదకులకు నా ప్రేమాభివందనములు. ఇకముందు కూడ ఇట్టి వ్యాసరచన పోటీలను ఏర్పరచి అందు ఎన్నికైన వ్యాసములను ప్రచురించి పత్రిక స్థాయిని మరింత పెంపొందింపగలరని ఆశించుచున్నాను.

టి. రామచంద్రరావు (జమ్మికుంట)

* * *

"సినిమాలూ—జాతీయ సమైక్యతా"—ఈ మూడు వ్యాసాలు చాల చాల చప్పగా ఉన్నాయని చెప్పటానికి చాల చింతిస్తున్నాను.

వై. వి. ఎస్. ఆర్. ప్రసాద్ (యద్దనపూడి)

### కథలు

శ్రీ తంబుగారి మార్చికి మార్చికి మధ్య (సే నాక డిని) సెప్టెంబరునే అని అనుకోటానికి, వారి సంఘంలో అప్పుడే చేరిపోయాను అనటానికీ ఈ ఉగాది సమయంలో చాల సంతోషంగా ఉంది.

ఈ సంఘ స్థాపన మా ఊళ్లోనే కాబట్టి, ఈ సంవత్సరం ష్యూర్‌గ మా పరీక్షలు సెప్టెంబరే కాబట్టి, సభ్యత్వం వెంటనే పొందేశాం! తంబుగారిని అభినందిస్తూ మిమ్మల్ని కూడ ఆహ్వానిస్తున్నాను.

ఎ. టి. అనంతరావు (విశాఖపట్నం)

* * *

మీ ఉగాది సంచికలో ప్రచురించబడిన "మార్చికి మార్చికి మధ్య లేక సెప్టెంబర్ల కథ" చదివాము. రచయితగారి శైలిని బట్టి ఇదేదో స్వీయ చరిత్ర బాపతేమో అని మాకు అనుమాన మేసింది.

మా కాలేజీలో ఉన్న ఒక విద్యార్థి రచనా విధానం కూడ అచ్చు యిలాగే ఉంటుంది. వారు కూడ ప్రస్తుతం దండయాత్రలు సాగిస్తున్నారు. కొంపతీసి మీ 'తంబు' గారు మా '.......' గారు ఒక్కరే కాదుకదా అని అనుమానంతో మేమంతా ఎంతో గింజుకులాడుతున్నాం. దయచేసి పత్రికా ముఖంగా మా అనుమానం తీరుస్తారని ఎదురు చూస్తుంటాం.

కథ చదువుతున్నంతసేపూ కడుపుబ్బి నవ్వలేక చచ్చామంటే నమ్మండి. తంబుగారికి మా హృదయపూర్వక అభివందనలు.

సురేఖ, స్నేహబృందం (విశాఖపట్నం)

* * *

'శుభలేఖ' కథ చాల హృద్యంగమంగా ఉన్నది. కథ సుఖాంతమయినప్పటికి మేస్టారు తన ఆశలు ఫలించకుండ చనిపోవటం హృదయవిదారకం. రెండవది, గోపీ మరల ఒక పోస్ట్‌మన్‌గ ప్రత్యక్షమవడం అంతకన్నా నిరాశాజనకంగా ఉంది. అలా గాక, మేస్టారు బ్రతికివుండి, శ్యామల భర్తగా గోపీని చిత్రించి వివాహసమయంలో మేస్టారి ఎదుట ఈ ప్రియతమ శిష్యులను తన కుటుంబ వ్యక్తులుగ కూడ చూడగలిగి ఉంటే, ఆయన ఆనందం అనుభవైకవేద్యం. కథకు మరింత శోభను చేకూర్చగలిగేవారు రచయిత.

సి. రామచంద్రరావు (గుంటూరు)

### ఉగాది సంచిక

ఈసారి మీ ఉగాది ప్రత్యేక సంచిక అంత ఆకర్షణీయంగా లేదు. మామూలుగానే ఉంది. శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావుగారి వ్యాసం తప్పితే మిగతా కథలన్నీ ఏమీ బాగులేవు.

బి. ఎస్. రావు (హైదరాబాదు)

### ముఖచిత్రం

ముచ్చటైన ముద్దులు గొలిపే ముఖచిత్రం—బాపు అభినందనీయులు.

అడవి (హైదరాబాద్)

* * *

తారల ముఖచిత్రాలు చూచి చూచి విసుగు చెందిన మాకు ఉగాది ప్రత్యేక సంచిక ముఖచిత్రం చూచిన పిదప ఎంతో ఉత్సాహం కలిగినది. పల్లె వాతావరణమును తెలుపు ఈ చిత్రం చూపరుల దృష్టిని ఎంతో ఆకర్షించగలదు. బాపుగారికి, మీకు మా హృదయపూర్వక ఉగాది శుభాకాంక్షలు.

ఎన్. నరసింహారావు (తిరుమల)

* * *

29—3—63 వ తేది ఆంధ్ర సచిత్ర వార పత్రికకు శ్రీ బాపుగారు వేసిన "ఉగాది బొమ్మ" ముఖచిత్రం ఎంతో వన్నె తెచ్చింది. అది చక్కని భావమును వ్యక్తపరచుచు శోభాయమానంగా ఉన్నది. ఈ చిత్రం నన్నే కాకుండా, చదువరి ప్రతి ఒక్కరిని తప్పకుండ ఆనందభరితునిగా చేస్తుంది. ముఖ్యముగా యీ ముఖచిత్రం వేసిన బాపుగార్కి నా అభివందనములు.

టి. సరోజినిదేవి (పుల్లూరు)

* * *

### హరివంశం

ప్రతివారము పత్రికలో "హరివంశము" వేయుటలేదు. కృష్ణయ్య కథ మంచి రసవట్టులో ఉంది. మాకు చాలా నిరుత్సాహకరంగా ఉంది.

వి. సరోజాదేవి (పెంటపాడు)

### న్యూఢిల్లీ లేఖ

శ్రీ శ్రీకృష్ణగారి న్యూఢిల్లీ లేఖలో నిష్పాక్షిక దృష్టి స్పష్టముగా కన్పిస్తున్నది. నేటి పన్నుల భారము, దేశ అభివృద్ధి 'సూచీ కటపత్ర న్యాయము' అని చెప్పవచ్చును.

లలితశ్రీ (పురుషోత్తమపట్నం)

### మనమూ—మన దేహస్థితీ

మనమూ—మన దేహస్థితీ వ్యాసంలో రచయిత ఇచ్చిన పట్టీలో జీడిపప్పును గురించి వ్రాయలేదు. మర్చిపోయారా? లేక కావాలని వ్రాయలేదా? జీడిపప్పు ఎన్ని కేలరీల ఉష్ణశక్తిని సరఫరా చేస్తుందో దయచేసి తెలుపుతారా? జీడిపప్పులో ఉండే విటమినులు కూడ తెలుపగలరా?

పి. ఎస్. లక్ష్మి (విజయవాడ)

### సలహా

ఎడిటర్‌జీ! మీరు మరల "కథకాని కథల శీర్షిక" ప్రారంభిస్తామని తెలియపరచినందులకు చాలా సంతోషం. కాని, నా దొక మనవి. ఏమంటే, కథకాని కథ శీర్షికలో బహుమతులు పొందినవారికి డబ్బు యిచ్చేదానికంటే ఆ డబ్బు విలువకు తగినంతకాలం ఆంధ్ర సచిత్ర వారపత్రిక పంపిస్తే బావుంటుందని నా ఉద్దేశ్యం.

శ్రీమతి వి. వి. జయప్రసాద్ (హవుషంగాబాద్)

### చదువుల్రావు

హలో! చదువుల్రావుగారూ, నమస్తే. ఏమిటి విశేషాలు? మీరు పరీక్షల ప్రిపరేషన్‌లో పడి క్షవరం చేయించుకోవడం మరచారు. మొట్టమొదట మీ బొమ్మని చూసి మీ రనుకోలేదండోయ్! వెంటనే క్షవరం చేయించుకోండి. అలాగ బొమ్మల్లో పడకండేం! లేకపోతే అందంగా ఉండరు. అమ్మాయిలు ప్రేమించరు.

మారుతిరావ్ (కోటఉరట్ల) ★

* * *

## "నేను దొంగ బంగారం వ్యాపారిని"

వచ్చేవారమే ప్రారంభం!


CROOKES
Lacto-Calamine
SOOTHING
HEALING
NON-GREASY
SHAKE THOROUGHLY




మీ
సౌందర్య
సాధనము

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 12—4—63
శోభకృన్నామ సం॥ చైత్రమాసం॥ బహు॥ విదియ
సంపుటము 55 సంచిక 32

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకులు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకులు
శివలెంక రాధాకృష్ణ


## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 13.00 ఇతర దేశాల. ఓడమీద Sea Mail రు. 20.00 (విమానం ద్వార Air Mail బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాల— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*


ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1





వర్ధమానతార కృష్ణకుమారి [ప్రభాకర్]

# మనలోమాట

'వెండిమబ్బు' 'అతని ఎన్నిక' వంటి రచనలతో ఆంధ్ర సచిత్ర వార పత్రిక పాఠకుల అభిమానం చూర గొన్న శ్రీమతి త్రివేణి నవల ఈ సంచికలో ప్రారంభిస్తున్నాము. 'తామరకోలను' కూడా పాఠకులకు బాగా నచ్చుతుందని అనుకుంటున్నాము ........

* * *

పోయినవారం సినీమా తార భర్తకి సంబంధించిన వ్యాసం ఒకటి ప్రచురిస్తామని ప్రకటించాము. శ్రీ కార్లో పాంటీ సుప్రసిద్ధ అంతర్జాతీయ తార సోఫియా లారెన్ భర్త. ఈయన పెద్ద ప్రొడ్యూసర్ కూడా మన దేశంలో కీర్తిగడించిన తారల భర్తలునయితే ఇటువంటివ్యాసాల వ్రాస్తే వేయగలమని ఆశిస్తున్నాము'

* * *

జంతువులు ఆలోచించగలవా? శీర్షిక క్రింద వచ్చే వారం మరొక వ్యాసం ప్రచురించపోతున్నాము ఈ రెండు వ్యాసాలు చదివితే, వింత విషయాలు కొన్ని తెలుస్తాయి! జంతువులు ఆలోచింగగలవా? అనే ప్రశ్నపై పాఠకులు తమ అభిప్రాయాలు ఉదాహరణలతో!— వ్రాస్తే బాగుంటుంది!!...

* * *




# విషయానుక్రమణిక


గవర్నరు పదవి
పత్రికలు




నీడతో కుస్తీ
ఇండియాను బెదిరింపు ఆలోచన
చైనా-పాక్ ఒప్పందం


పొదుపు చర్యలు
దుబారా
OOMMEN



బెల్జియం ఫ్రాన్సు, పశ్చిమజర్మనీ, హాలెండ్, ఇటలీ, స్విడ్జర్లండు దేశాలలోని ప్రముఖ వాణిజ్య పత్రికా రచయితలు, భారతదేశంలో తమ మూడువారాల పర్యటనలో, ప్రధానినెహ్రూను కలుసుకున్నప్పటి దృశ్యం.

# రాజకీయ ప్రభావాలకు లోనై దేశైక్యతకే దెబ్బకాగల హిందీవాదం

**శ్రీ కృష్ణ**

బ్రిటిషు పార్లమెంటు అన్నింటికీ తల్లిలాంటి దంటారు. అయితే యిటీవల దానిని దిగజారిపో యిందని నిరసిస్తూ అనేక రకాలైన వ్యాసాలు విమర్శలు తలఎత్తాయి. పరిపాలనా యంత్రాంగం యొక్క శక్తి 'పార్టీ'లు ఉండటంచాత, అధికా రాన్ని పొందిన పార్టీకి హస్తగతం అవడం సహజమే గాని, యీ మాటకు యిటీవల అర్థం కాబినెట్‌గా పరిణమిస్తున్నది. యుద్ధానంతరం యించు మించు కాబినెట్ ప్రభుత్వం వైపం చూస్తే, అది ప్రధానిగారి ప్రభుత్వంగా అగుపిస్తున్నది.

ఉదాహరణకి "పట్నాయిక్ పాఖ్యానం" సంగతి గమనిస్తే చాలు.

ఈయనగారు—అంటే పట్నాయక్‌గారు ఒక వెనుకబడ్డ రాష్ట్రం యొక్క ముఖ్యమంత్రి. కాని, ప్రధానికే సలహాలు చెప్పగల సదుపాయా లీయ వకః కల్పించడ మైనది.

శ్రీ నెహ్రూ లోక్‌సభలో చెప్పుతూ, శ్రీ పట్నా యక్ దేశరక్షణోపాయాలను, పథకాలను ఎలా ఎలా తీర్చిదిద్దాలీ అనేది కూలంకషంగా ఆలోచించిన వ్యక్తి అనీ, యిటీవల వచ్చిన చాలా విదేశ సైనిక పరిశీ లక సలహా యిత్యాది సంఘాలు మన దేశానికి వచ్చాయి. వీటితో శ్రీ పట్నాయక్‌గారికి బాగా పరిచయం ఉన్నదని శ్రీ నెహ్రూ అంటు న్నారు. పైగా రక్షణాయుధాదుల అవసరాలు ఆయన ఎరుగునట!

ఐతే కావచ్చునేమో గాని, ఏవిధంగా శ్రీ పట్నా యక్కు యీ అవకాశం, మంతనాలలో పాల్గొనే సదుపాయం యిదివరకు కలిగిందో ప్రధాని చెప్పనే లేదు.

**మొన్నటి దాకా నెహ్రూగారి వెనకాతలే కూర్చున్న శ్రీ కృష్ణ మీనన్‌గారు ఒకానొక వారపత్రిక యొక్క ఎన్నికాపీలు ప్రభుత్వ రక్షణ సర్వీసులు చందాకట్టి తెప్పి స్తున్నవో చెప్పలేమన్నారు. ఎందు కంటే "ప్రజాశ్రేయస్సు దృష్ట్యా సదరు నిజం చెప్పడం భావ్యం కాదన్నారు" కాని శ్రీ పట్నా యక్ విషయం అంతా కలియగట్టి అమెరికాలోని వైమానిక సైనిక శాఖలకు తెలియజేసి మరీ వచ్చారు. కాని "ఇదంతా నలుగురికి తెలిసిన మామూలు విషయమేననీ "అమెరి కీయం"గా చేసి వారికి చెప్పడం జరి గిందని"**

అది అలా ఉంచి మరో సంగతి మనం గమ నించవేలేదు. శ్రీ నెహ్రూ, శ్రీ పట్నాయక్‌కు కల్పించిన ఈ ప్రత్యేక గౌరవంవల్ల తతిమ్మా ముఖ్యమంత్రులకు ఏమి వొరిగిందో ఎవరికీ బోధ పడటంలేదు.

పోనీ శ్రీ నెహ్రూ మంత్రివర్గానికి ఇదేమేనా ఆపాదిస్తున్నదా అంటే అదీ లేదు. మొత్తంమీద ఈ పట్నాయకోపాఖ్యానం ఓ విషాదగాథగా తయా రయ్యింది.

పార్లమెంటుకు డా. రాధాకృష్ణ ప్రారంభోత్సవం జరిపిన రోజున సెంట్రల్ హాలు నుంచి నిష్క్రమణం జరిపిన హిందీ యింపీరియలిస్టులను లోక్‌సభ ఈ వారం మందలించడం జరిగింది. వీళ్లను చీవాట్లు పెట్టాలీ అనే తీర్మానంపై చర్చ జరిగినప్పుడు చాలా కుతూహలజనకమైన సంగతులు తెలిశాయి. కమ్యూనిస్టు ఉపనాయకుడైన ప్రొఫెసర్ ముఖర్జీ, "హిందీవాదుల అభిప్రాయాలను ఉపేక్షా భావంతో చూడరా" దన్నారు.—ఇదీ ఆశ్చర్యకరమైన సంగ తియే! ఎందుకంటే యీ ముఖర్జీగారి సొంత రాష్ట్రం పశ్చిమ బెంగాల్‌లో ప్రజలంతా హిందీ వ్యతిరేకులే!

ఇక స్వతంత్రపార్టీకి చెందిన హిందీ ప్రాంతీయు లంతా యించుమించు ముఖర్జీగారి అభిప్రాయా

**51వ పేజీచూడండి**



సికిందరాబాదులో స్విమ్మింగ్‌పూల్ నిర్మాణానికి ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి ఉగాదిన శంకుస్థాపనచేశారు. మంత్రులు శ్రీయుతులు బ్రహ్మానందరెడ్డి, రామచంద్రారెడ్డి, గురుమూర్తి, ఆలపాటి. ఈ ఉత్సవంలో పాల్గొన్నారు.

# అశుభాలమయమైన శుభకృత్..!

కొత్త సంవత్సరం వచ్చేసింది. ఉగాది—పచ్చడి నాలుకమీద వేసుకోగానే రుచులు చెప్పటం మొదలు పెట్టింది. మోహం విట్టించి మరుక్షణంలోనే కళ్ళు విప్పుకుని, మొహం వెడల్పు చేసుకుంటాం. దీన్నిబట్టే రుచులు ఎంత విభిన్నంగా ఉంటాయో తేటతెల్లమవుతుంది. జీవితం కూడా అంతే. సుఖ దుఃఖాలు అవిచ్ఛేద్యంగా, ఒకదాని కొకటి పెనవేసుకొని పోయి, మనస్సును కలవరపెడుతూ ఉంటాయి. ఒక్కొక్క కాలంలో వచ్చిపడ్డ కష్టాల్నిబట్టి, ఆ సంవత్సరాన్ని నిందించటమో, అనుభవించిన సుఖాల్నిబట్టి ఆ సంవత్సరాన్ని అభినందించటమో జరుగుతూనే ఉంటుంది. శరీరంమీద సవారి చేస్తూ, గుండ్రంగా తిరుగుతూ వస్తున్న ఈ సంవత్సరాలు, రకరకాల పేర్లతో సాక్షాత్కారమవుతూ ఉంటాయి. కొన్ని వికృతంగా కనబడుతూ, వికారాన్ని కల్గిస్తాయి. క్రోధంగానూ, రౌద్రంగానూ పరాభవాన్ని వెంటబెట్టుకుని వ్యయంతో అంతమొందుతాయి. కొన్ని సాధారణంగా ప్రారంభమయి సౌమ్యంగా నడుస్తూ, ఆనందంగా జయ విజయోత్సవాలతో, జీవితంలోకి మన్మథ బాణాన్ని విసురుతూ, నందనవనంగా మారుస్తాయి. ఈ పేర్లు వీటి కెట్లా వచ్చినాయో యేమోమరి! కాలంయొక్క పరిమాణంలో అనుభవించిన అనుభూతులనుబట్టి, ఆదిమానవుడు ఈ నామకరణాలు చేసిఉంటాడేమో ! ఇదంతా పెద్దకాల ప్రవాహం. ఈ ప్రవాహానికి మధ్య గీతలు గీయటం లాంటిదే, కాలాన్ని విభజించి వేరువేరు పేర్లు పెట్టటమూ అని మిస్టర్ శ్రీనివాస్ అభిప్రాయం. మనం వేసుకోవటంలో ఉంటుంది ఏదైనా, పేర్లో ఏముంది అంటాడు. పంచాంగాలు పట్టుకుని, ప్రవేశించిన సంవత్సరం ఏం తెచ్చిపెట్టిందో కొంపకు అని ఆతుర్దాగా, రాసులు పరిశీలిస్తున్న వ్యక్తుల్ని చూసి జాలిపడతాడు. ఆట్టే ఆలోచిస్తే దీంట్లో కొంత సత్యం లేకపోలే దనిపిస్తుంది. కాని మనస్సాగదు. నమ్మకం లేకపోవటం ఒక విషయం, నిబ్బరంగా ఉండిపోవటం యింకో విషయం. ఈ రెంటికీ సమన్వయం ఉండదు. ఒకాయన తాయెత్తొకటి తెచ్చి మిస్టర్ శ్రీనివాస్‌కు యిస్తే, దీన్ని ధరించటంవలన ఏవో లాభాలు ఒదిగివడతాయనే నమ్మకం నాకు మాత్రం లేదు అన్నాడు. అప్పుడాయన అన్నాడుట, "మీకు నమ్మకం లేకపోయినా సరే, ఈ తాయెత్తు ధరిస్తే ఆ లాభాలు రాకమానవు" అని. వెంటనే మిస్టర్ శ్రీనివాస్ స్వీకరించాడు; అలాంటప్పుడు తన వాదానికి భంగం రాదన్నట్లు. అట్లాగే నాకు నమ్మకం లేదంటూనే, అయినా ఏం రాశాడో చూద్దాంలే అని కొత్త పంచాంగంలో తొంగిచూడటం పరిపాటి. బాగా రాశాడా, "నేను అనుకుంటూనే ఉన్నానే, ఈయేడు మన జాతకం మహోద్భుతంగా ఉంటుందని", అంటూ ఆ జాతకానికి యెక్కువ ప్రాముఖ్యత యిచ్చినట్లు కనిపించాడు. ఖర్మంచాలక ఏమైనా చెడుగా రాశాడా, "నేను చెప్పటంలా, అబ్బర్! ఇట్లా అవటానికి వీల్లేదు. అన్నీ తప్పులే. అందుకనే అసలు ఈ పంచాంగాల్లో నమ్మకంలేదని చెప్పింది" అని సమర్థించుకోవడానికి ప్రయత్నం చేస్తాడు. పైకి ఎంత బింకంగా ఉన్నా, లోపల పీకుతూనే ఉంటుంది, ఏమిటి యిట్లా రాశాడని. మనోనిబ్బరం, ఆత్మ విశ్వాసం, నిశ్చితాభిప్రాయం లేకపోవటంవలనే ఇలాంటి భ్రమణం కలుగుతూ ఉంటుందని మిస్టర్ శ్రీనివాస్ అభిప్రాయం. అసలు ఈమాదూ ఉన్నవాడు, భూలోకంలో ఉన్నాడా అనిపిస్తుంది.

ఏదేమైనా శుభకృత్ వెళ్ళిపోవటం, శోభకృత్ సంవత్సరం ప్రవేశించటం జరిగిపోయింది. వెళ్ళిపోతున్న సంవత్సరానికి వీడ్కోలు, వస్తున్న సంవత్సరాన్ని ఆహ్వానించటం లోకాచారం. వ్యక్తులకు కూడా ఈ వీడ్కోలు, ఆహ్వానాలు సహజమే ! రిటైరయిపోయి వెళ్ళిపోతున్న ఉద్యోగస్తునికి ఘన సన్మానం చేసి, ఆయన గుణగణాలను ప్రస్తుతించి ఇంద్రుడూ చంద్రుడూ అని పొగడేస్తారు; ఆయన ఎలాంటివాడైనా సరే. అయితే ఈ సంవత్సరాల విషయంలో యిట్లా ఉండదు. నిర్మొహమాటంగా ఆ సంవత్సరం తెచ్చిపెట్టిన ఉపద్రవాలను ఏకరువు పెట్టి, అమ్మయ్య వెళ్ళిపోయింది; బ్రతికి బైట పడ్డాము. ఈ క్రొత్త సంవత్సరం యెలాంటి శుభాల్ని తెచ్చిపెడుతుందో చూడాలి అని నిట్టూర్పు విడుస్తాము. ఈవిధంగా నిష్పక్షపాతంగా పరిశీలిస్తే, శుభకృతునామ సంవత్సరం తన పేరును సార్థకం చేసుకో కలిగిందా అంటే, లేదనే చెప్పాలి. అన్నీ అశుభాలే ! దేశవ్యాప్తంగానూ, రాష్ట్రవ్యాప్తంగానూ కూడా అన్నీ చెడు ఫలితాలే తెచ్చిపెట్టిందని చెప్పాలనిపిస్తుంది. దాని తర్వాత వచ్చిన సంవత్సరం కూడా మంచి పేరుతోనే ఉంది. పేరును చూసి ఓసారి మోసపోవటం జరిగింది. మరి యిదేం తెచ్చిపెడుతుందో యేమో ! ఉపద్రవం వచ్చిన నాలుగు రోజులపాటు ఏవో వైరాగ్యపు ఆలోచనలు పోవటం, కాస్త మలుపు తిరగగానే మళ్ళీ మొదలే ! ఈ కష్టాలు రావటం, బాధలు పడటం, అశాంతి ప్రబలటం—యివన్నీ మామూళ్ళయి పోయినాయి. ఆట్టే పట్టింపేమీ కనిపించటం లేదు. 'మూడు వైరాగ్యాలు' ప్రస్తావించి మళ్ళీ మానవుడు ఆశాపాశంలో పెనవేసుకుపోతాడని సూచించారు. బాధపడుతున్నప్పుడున్న మనస్సు అది తీరిపోయిన తర్వాత ఉండదు; సహజం. అందుకనే సంవత్సరానికీ సంవత్సరానికీ ఏదో పెద్ద పెట్టున తేడా ఉంటుందనుకోటానికి గాని, మంచి రోజులు రాకపోవనే సహజమైన మాటకు గాని, పెద్ద విలువేమీ ఉండటంలేదు. ఇది నిరాశావాద మేమీ కాదు. ప్రస్తుతం మన కళ్ళయెదుట ఉన్న వాతావరణాన్నిబట్టి, యెవరి ఊహైనా ఇట్లాగే ఉంటుంది. అయితే పరిస్థితులు మెరుగుపడక మానవు ఏదోనాటికి, అనే ఆశాభావమూ అందరిలోనూ ఉంటుంది. ఇదీ సహజమే. ఎవరో ఒకాయన జ్యోతిష్కుని దగ్గరకు వెళ్ళాడుట. ఆయన చెప్పాడుట, "మీరు ఈ సంవత్సరం ప్రారంభంలో మొదటి నాలుగు నెలలూనూ అశాంతితోనూ," ఆర్థికమాంద్యంతోనూ, అనిశ్చిత వాతావరణంతోనూ బాధపడతారు" అని. ఎంత కటువుగా కష్టాలు చెప్పినా, ఆశాభావం దాంట్లో లేకపోలేదు. అందువలనే గభాలున మిగతా ఎనిమిది నెలల మాటో అని నోరు చేసుకుని అడిగాడుట. "ఏముంది, అలవాటుపడిపో

61-వ పేజీ చూడండి



సామ్యూల్ బ్రాన్‌స్టన్ నిర్మించిన 'ఎల్‌సిడ్' చిత్రంలో సోఫియా లారెన్

"మా వివాహం చట్టరీత్యా కొన్ని చిక్కులలో ఉంది," అన్నాడు ప్రఖ్యాత నిర్మాత, "కాని మా జీవితం చాలా సాఫీగా, హాయిగా నడుస్తోంది. మా వ్యాపారం, వృత్తివల్ల పని ఎక్కువగా ఉంటుంది. అయినా ఆదివారం మాత్రం సంతోషంగా ఇంటిదగ్గరే గడుపుతాము. ఎప్పుడో గాని, సినిమాలు చూడము. నా భార్య ఇంతవరకూ, తను వేసిన "ఎల్‌సిడ్" చిత్రాన్ని పూర్తిగా చూడలేదు. సోఫియా స్వభావానికీ, నా స్వభావానికీ చాలా తేడా ఉంది కాని నిజమయిన స్త్రీ అంటే ఆమె. అసలయిన నియోపాలిటన్ (Neopolitan)— బద్ధకం, చాంచల్యం, దురుసుతనం, వీటికి తక్కువ లేదు. అయినా ఈ 'లోపాలకు' పరిహారం అనిపించే నమ్రత, వినయం ఉన్నాయి. ఆమె పట్టుదలే ఆమె నింత పెద్ద నటిగా

# సోఫియాతో నా జీవితం

## కార్లో పాంటీ: సోఫియాలోరెన్ భర్త

**చేసింది. అందువల్లనే కేవలం 'సెక్స్ అప్పీల్' మీద ఆధారపడే బ్రిజిట్ బార్డో మొదలయిన నటీమణులకన్నా, ఆమె ఎంతో మెరుగు."**

కార్లో పొంటీ ఎక్కడ దొరుకుతాడు ? లండన్‌లోనా ? న్యూయార్క్‌లోనా ? రోమ్‌లోనా ? స్విట్జర్‌లాండ్‌లోనా ? పారిస్‌లోనా ?—పారిస్‌లో, నం 10, ఆవెనూ ఫోక్‌లో అతని మేడలో అతన్ని కలుసుకోగలిగాను.

అతను పారిస్‌లో ఎందుకున్నాడు ? కార్లో పొంటీయే చెప్పాడు : "సోఫియా ఎక్కడుంటే అక్కడే నా ఇల్లు ! ఇవాళ పారిస్, రేపు రోమ్, లండన్ లేకపోతే న్యూయార్క్. ఎక్కడయినా ఒకటే. అయితే, సోఫియాకి నచ్చాలి; అంతే నేను కోరేది. ఈ ఇల్లులాగ పెద్దదయినా సరే, స్విట్జర్‌లాండ్‌లో మాకున్న ఇల్లువంటిదయినాసరే నా కనవసరం.

"మళ్లీ చెబుతున్నా—సోఫియా, నేనూ కలిసి ఉండడం మాత్రమే ముఖ్యం."

"మా గృహం నిలకడగా ఉండటం కష్టం. ఇలు మారినప్పుడెల్లా ఏదో మా ప్రయత్నం చేస్తూనే ఉంటాం, కాని ఒకరినని లాభం ఏమిటి ? మా వృత్తే అంత. మేము మనుష్యులమే అంత. సాధారణంగా ప్రజలు, నిర్మాతలనీ, తారలనీ రాక్షసులని చూసినట్లు చూస్తారు. ఈ అభిప్రాయం కలగజేసే పనులు మేమేవీ చెయ్యం : వృత్తిమాత్రం ఎన్నుకున్నాం. వృత్తితోబాటు మాకు ప్రత్యేకమయిన వేషాలు తొడిగారు కొందరు. ఈ వేషాలను వదిలించుకోవడటం కష్టం. నా విషయం ఫరవా లేదు. సోఫియా సంగతి వేరు. చాలా కష్టాలున్నాయి.

"సినిమానటిగా 'చేరిన' ఏ వ్యక్తి జీవితమూ సుఖంగా ఉండదు. అంటే నేను సోఫియాను గురించి ప్రత్యేకంగా మాట్లాడటంలేదు. అందరు నటీమణుల సంగతి ఇంతే. అందులోనూ ఈ వృత్తిలో చేరిన ప్రారంభంలో వారికి కావలసిన 'ప్రచారం' దొరకనివారి సంగతి చెప్పనేఅక్కర్లేదు. మొట్టమొదట పత్రికల సహకారం అవసరం. మొదటి పేజీలోకి ఎక్కడం కష్టంకాదు— కొంచెం విశిష్టమయిన పని చేసి చూపడమో, మాట జారవిడవడమో అవసరం.... అయితే, కష్టాలన్నీ ఈ నటీమణి మొదటి పేజి సాధించిన తర్వాతనే వస్తాయి. సంపాదకుడు ఒకటవ పేజీలో ఆమెను గురించి కొన్ని పేరాలు వేయిస్తాడు. చదివేవాడు వాటిని చకచక చూసి, తర్వాత పేజీకి పోతాడు. ఇక్కడ పత్రిక 'స్వరం' మారుస్తుంది ! ధర్మపన్నాలు చెప్పే వ్యాసాలు చదువరికి కనిపిస్తాయి. స్త్రీ వ్యామోహం పనికిరాదనే ప్రశ్న ఉంటుంది. ఇటలీలో ఈ దురలవాటు చాలా సామాన్యంగా చూడవచ్చు. పత్రికలు ఈ వివాదాస్పదమయిన ధోరణి బాగా చూపిస్తాయి. సరే చదువరులకీ ఈ 'ఆట' బాగా అలవాటయిపోయింది. వారం వారం కొత్తరకం.... ఆకర్షణలు కావలసివచ్చేది వారికి. 'పినప్స్' (Pinups)— ఈ విధంగానే బయలుదేరాయి.

"సోఫియా కూడా పినప్‌గానే మొదలుపెట్టింది ఆరంభంలో బాగానే ఉండేవి కాని కష్టాలు వెంటపడ్డాయి—పైన చెప్పిన 'ఆట' మానేద్దామని ప్రయత్నించినప్పటినుంచీ సినిమా వృత్తిలో ఆమె ప్రవేశం శరీర ప్రదర్శనతో మొదలయినదన్న విషయం మరిపించాలని చాలా ప్రయత్నం చెయ్యవలసివచ్చింది.

"మొదట్లో సోఫియా వట్టి 'పినప్' మాత్రమే —చూడటానికి బావుండేది. అదంతా నాకు బాగా గుర్తు. ఇటువంటి పినప్‌లు ఎందరో లెక్కలేదు. వారందరికీ అభినయం ఎంత వచ్చు ? కాని సోఫీ విజయం సాధించగలిగింది. ప్రపంచంలో ఆమెకి తప్ప మరే నటీమణికీ ఇటాలియన్, ఫ్రెంచి, ఇంగ్లీషు, స్పానిష్ అంత ధారాళంగా రావు. డబ్బింగ్ అనవసరం. ఇంగ్రిడ్ బెర్గ్‌మాన్ ఇటలీలో ఉన్నప్పుడు రోసెలినీ తీసిన కొన్ని చిత్రాలలో ఇంగ్లీషులో తప్ప మాట్లాడలేకపోయింది. 'ది మిలియనేరస్' (The Millionairess) చిత్రములో సోఫియా ఒక ప్రత్యేకమయిన యాసతో ఇంగ్లీషు మాట్లాడగలిగింది. గోల్డిని తీసే సినిమాలో లిజ్ టేలర్ ఇటాలియన్ (వెనిస్ ప్రాంతం యాసతో) మాట్లాడటం మీరు ఊహించగలరా ?

"తన నటనా నైపుణ్యంతోనే సోఫియా తను పినప్‌గా మొదలుపెట్టినదన్న విషయం మరిచిపోయేట్లు చెయ్యగలిగింది. బ్రిజిట్‌బార్డో ఇది సాధించలేకపోయింది. ఆమెలో శారీరకమయిన ఆకర్షణ చాలా ఉంది. అందం ఇంతా అంతా కాదు. దీనివల్లనే మంచి ఖ్యాతి సంపాదించుకుంది కాని ఆమె ఎన్నటికీ గొప్ప నటి కాలేదు. హాస్య, విషాద రసాలు సమానమయిన నైపుణ్యంతో పోషించలేదు.

సోఫియా ఈ లక్ష్యం సాధించగలిగింది. 'లాచియోచియారా' సినిమా చూస్తే మీకే తెలుస్తుంది. ఆమెలోని ప్రతి అణువూ ఆ పాత్ర ధరించటంలో మునిగిపోయి ఉంటుంది చూడండి ! ఆమె తన అభినయశక్తిని ఎంత సున్నితంగా అభివృద్ధి చేసుకుందో తెలుస్తుంది. ఆమె నైపుణ్యం పరిపక్వం చెందింది. విమర్శకులంతా ఆశ్చర్యపోయారు. ఇప్పుడిప్పుడే ఆమె 'నిజమయిన విలువ' వి అంచనా వెయ్య కలుగుతున్నారు. 'బాయ్ ఆన్ ఎ డాల్ఫిన్' చిత్రంలో ఆమె నటన గురించి మర్చిపోలేమన్నారు. ? అతి సామాన్యురాలయిన ఒక నటికి 'అదృష్టవశాత్తు మంచి అవకాశం ఒకటి దొరికి పెద్ద పేరు తెచ్చుకోగలిగింది' అన్నారు.

"నేను చాలాకాలంగా సినిమాలు తీస్తున్నాను. నటీమణులని మూడు రకాలుగా విభజించటం నాకు అలవాటు. (1) శారీరకమయిన ప్రతిభ సూచించేవారు. (2) ఆధ్యాత్మికమయిన ప్రతిభ సూచించేవారు. వారిద్దరికీ ప్రతిభ ఉన్నప్పటికీ అందం తక్కువగా ఉండవచ్చు. (3) శారీరకమయిన సౌందర్యంతోబాటు ప్రతిభ కూడా కలవారు. మొదటి తరహాలో చేర్చవలసిన తారలు కొల్లలు. అయితే పేరు కొంతకాలమే 'ప్రకాశించి' మాయమయిపోతారు. రెండవరకం వారిలో ప్రత్యేకమయిన స్థానం కల వ్యక్తులలో బెట్టీ డేవిస్ ఒకర్తె. మూడవ కోవకు చెందినవారిలో ప్రథమ స్థానం గ్రెటాగార్బోది; జోన్ క్రాఫర్డ్ తర్వాత వస్తుంది. సోఫియా లారెన్ మొదటి రకం వ్యక్తిగా ప్రారంభించి, మూడవ తరహా వారిలో చేరిపోయింది. అయితే ఈ తరహాలో తక్కినవారికి లేని గుణం ఈమె కొకటి ఉంది. ఆమె అందరి మన్ననలనీ అందుకోగలదు. జగద్విఖ్యాతి గడించిన గార్బో యూరోప్‌లోనే మొదట పేరు పొందింది. యూరోప్ ప్రేక్షకులు కొంచెం మేధావుల క్రిందే లెక్క. అక్కడినించి ఆమె కీర్తి అమెరికాకి పాకింది. సోఫియా అంటే అమెరికాలోనూ, యూరోప్‌లోనూ కూడా అందరికీ సమానంగా అభిమానం. మాకు కేథరిన్ హెప్‌బర్న్ అంటే చాలా ఇష్టం కానీ, అమెరికాలో ఈమెకి అంత పేరు లేదు.

"అందుకనే సోఫియా ఒక అద్భుతమయిన స్త్రీ అంటాను—నాకంటే చాలా విభిన్నమయిన స్వభావం కలదయినప్పటికీ, లోపాలు లేని వ్యక్తి కానప్పటికీ, సోఫియా సెల్ఫ్‌మేడ్ మనిషి! కాని 'మిలాన్ పద్ధతులతో' లోపాలు సరిదిద్దుకొనటానికి ప్రయత్నిస్తుంది. 'మిలాన్ పద్ధతు' లంటే కేవలం తీవ్ర ప్రయత్నం చెయ్యటమే ! అందుకనే ఆమెను చూస్తే నాకంత గౌరవం. ఏ పనయినా సరే చాలా ఆసక్తితో చేస్తుంది. ఆమెకి చాలా పట్టుదలా, త్యాగంచేసే గుణాలూ ఉన్నాయి. 'నేపుల్స్' వారికి ఇవి చాలా తక్కువ ! బద్ధకం, దురుసుతనం, బడాయి ఎక్కువ వారికి.

"నాకు స్వరజ్ఞానం తక్కువ కాని సోఫియాకి సంగీతం అంటే చాలా ఇష్టం. ఆధునిక సంగీతం

౧౯వ పేజీ చూడండి



# మనసు

ఆదివిష్ణు

శంకరం తలవంచుకు కూర్చుని మాస్టారు చెప్పే ప్రతి మాటనీ ఆలకిస్తున్నాడు. మాస్టారు ఆరోజు చాలాసేపు మాటాడారు.

"ఇది లోకం నాయనా! నీవు చేసే ప్రతిపనికీ తోకలాగా కువిమర్శలు ఉంటాయి. నీవు లోకాన్ని ఖాతరు చెయ్యకపోవచ్చు. నిన్ను మాత్రం అనుక్షణం పరీక్షిస్తుంది లోకం. చిన్నవాడివి; తెలుసుకోవలసిన విషయాలు యింకా చాలా ఉన్నాయనే సంగతి మరచిపోకు."

శంకరం ఆయన కళ్ళలోకి సూటిగా చూశాడు. ఏదో చెప్పబోయి ఆగిపోయాడు. మళ్ళీ తల దించుకున్నాడు.

"నువ్వేదో చెప్పాలనుకుంటున్నావు. చెప్పు నాయనా! ఏమీ దాచుకోవద్దు."

ఈ మాటతో శంకరానికి ధైర్యంవచ్చింది.

"నాన్న మినహా నాకు మరో లోకంలేదు. ఆయన నా మాటకెప్పుడూ అడ్డుచెప్పరు. ఆ విషయం నాకు బాగా తెలుసు మాస్టారూ!"

మాస్టారు నవ్వారు. శంకరానికి ఆయ నలా నవ్వడం బొత్తిగా రుచించలేదు కాబోలు—మళ్ళీ చివాలున తలవంచుకున్నాడు.

"చూడు శంకరం! పిల్లలమాట కాదని వాళ్ళని నొప్పించాలనే ఉద్దేశ్యం ఏ తండ్రికీ ఉండదు. కాని పిల్లల శ్రేయస్సు నిమిత్తం వాళ్ళు తయారుచేసుకున్న పథకాలు తల్లక్రిందు లవడం సహించలేరు. నీ గురించి, నీ భవిష్యత్తుగురించి ఆయన ఆలోచనలు మరో విధంగా ఉండవచ్చునుగదా."

"మా నాన్న గురించి నాకు తెలుసు."

మాస్టారు ఏమీ మాట్లాడలేకపోయారు. మళ్ళీ శంకరమే అన్నాడు:

"ఆలోచించే జ్ఞానం నాకూ ఉందంటే నవ్వుకుంటారా మాస్టారూ! ఏది మంచో ఏది చెడో తెలుసు. నా సుఖంకోసం, నా భవిష్యత్తుకోసం నేను చేసుకున్న నిర్ణయాలపైన నాకు నమ్మకముంది; ఉంటుంది."

"నా మాటలుకూడా అర్థం చేసుకో శంకరం! సిరిసంపదలతో తులతూగుతున్నవారితో, ఒక రిటైరయిన బడిపంతులు వియ్యమందుకోబోతున్నాడంటే హాస్యాస్పదంగా కనిపిస్తుంది. రాధ నీకు కావాలి. తగినవారితో వియ్యమొందాలని మీ నాన్నగారి అభిప్రాయమై ఉండవచ్చు. ఆ మాటకొస్తే ఆయనలాంటి ప్రతిమనిషికీ అదే అభిప్రాయం ఉంటుంది. ఇలాంటి పరిస్థితిలో మీమధ్య—"

"మీరు చెప్పదలచుకున్నది నాకు తెలుసు మాస్టారూ! అందుకే అంటున్నాను: మా నాన్నచేత ఈ పెళ్ళికి ఒప్పించే పూచీ నాదని. ఇంతకంటే ఇంకేం చెప్పగలను?"

మాస్టారు తల పంకించారు.

"సరే, నీ యిష్టం. చీకటి పడుతోంది యిక ఇంటికి వెడదాం పద నాయనా!"

—మౌనంగా మాస్టార్ని వెంబడించాడు శంకరం. ఇంటికి వచ్చిన తర్వాత మాస్టారు తమ పోర్షనులోకి వెళ్లబోతూ అన్నారు:

"పరీక్షలు దగ్గరపడుతున్నాయి. శ్రద్ధగా చదువుకో!"

తలుపుతీసి గదిలోకి వచ్చాడు శంకరం. లైటు వేశాడు. గదిమధ్యగా ఒక చిన్న చీటి పడి ఉన్నది.. ఆ చీటీని చూడగానే నవ్వుకున్నాడు. "మళ్ళా ఆశాభంగం కలిగించాను కాబోలు ఖర్మం" అనుకున్నాడు.

చీటి విప్పి చదివాడు:

"హలో బావా!

అంతా మామూలే! హాస్టలునుండి వస్తూ నువ్వున్నావేమోనని చూచాను; లేవు. వచ్చినట్టు తెలియజేయడం నా ధర్మం గనుక— ఆ సంగతి ఈ కాగితంమీద రాసి కిటికీ ద్వారా అందజేయదలిచాను. వచ్చే ఆదివారం మా క్లాసు పిల్లలంతా పిక్నిక్ వేశారు. నువ్వెదైనా ప్రోగ్రాం వేస్తే, ఆ విషయం నాకు తెలియజేస్తే, నీకోసం (నువ్వు కోరావు కాబట్టి) ఆ పిక్నిక్‌కి తిలోదకాలు యిచ్చేస్తాను. పరీక్ష లొస్తున్న సంగతి నీకు తెలుసు. నేను

—45వ పేజీ చూడండి

# అందమా - ఆకర్షణా

సి. ఛాయ

ఇప్పుడు నేను చెప్పబోయేది అందానికి మరి కొన్ని ఏ క్రీమో అనుకొంటే మీరు నిశ్చయంగా పొరబడ్డట్టే. ఎందుకంటే అందానికి చిట్కాలు నాకు తెలియవు. కాని ఆకర్షణగా ఉండడానికి మాత్రం కొన్ని సూచన లిస్తున్నాను. కొంత మంది అందం, ఆకర్షణ రెండూ ఒకటే అనుకొంట రు. కాని, అందానికీ, ఆకర్షణకూ చాలా భేదం ఉంది. అందమంటే పుట్టుకతోనే వచ్చిన సౌందర్యం. కను ముక్కు తీరు చక్కగా ఉంటే అదే అందం. కాని ఆకర్షణ అంటే అది మనం అలంకరించుకొనే తీరు. కట్టు, బొట్టు, జుట్టు. ఇవి చక్కగా, కంటి కింపుగా తీర్చుకొంటే అనాకారులైనా ఆకర్షణగా కన్పిస్తారు.

మొదట 'కట్టు' విషయం చూదాం .... చాలా మందికి రకరకాల చీరలు ఉంటాయి కానీ వాటిని అందంగా ఎలా కట్టుకోవాలో తెలియదు. చీర ఎలాంటిదైనా మనం కట్టుకొనే తీరు చక్కగా వుండాలి. చీర కుచ్చెళ్ళు ఎడమ కాలిపై జీరాడుతూ ఉండాలి. అంటే కుచ్చెళ్లను మనం కుడి వైపు దోపుకుంటేనే అవి అన్ని ఎడమవైపు వస్తాయన్నమాట. ఇలా కట్టుకొంటే ఎంతో హుందాగా ఉంటుంది. ఇక జాకెట్టు విషయం. ఎప్పటికీ చీర, జాకెట్టు, తూర్పు పడమరలుగా ఉండకూడదు. అంటే జాకెట్టు రంగు, చీర రంగుతో ఎక్కడో ఒకచోట కలియాలి. ఈ మాచింగ్ ఎలా ఉండాలి ? చీర అంచు రంగు జాకెట్టుతో కలిసిపోవాలన్నమాట. ఉదా :—తెల్లటి చీరకు ఎర్రటి అంచు ఉందనుకోండి. ఆ ఎర్రటి రంగులోనే జాకెట్టు వేసుకోవాలి. ఇలా వేసుకొంటే చూడ్డానికి చక్కగా ఉంటుంది. ఇంకా పువ్వుల చీరలు, గళ్ల చీరలు, చుక్కల చీరలు ఎన్నో ఉన్నాయి కదా. వీటిలో ఆ పువ్వులు, చుక్కలు, గళ్ళు ఏ రంగులో ఉంటే అదే రంగు జాకెట్టు వేసుకోవాలన్నమాట. ఒకేరంగు చీర అయితే తెల్ల జాకెట్టు వేసుకోవచ్చు. ఎందుకంటే తెలుపులో అన్ని రంగులూ ఉన్నాయి. కాబట్టి తెలుపు ఏ చీర కయినా 'మాచ్' కాగలదు. పొట్టిగా ఉన్నవారు పెద్ద అంచు చీరల జోలికి పోకూడదు. ఇలాంటివారికి ఒకేరంగు చీరలు, నిలువు చారల చీరలు బావుంటాయి. అయితే మా చీరలు కట్టడంలో సమయా సమయాల్ని గుర్తించాలి. భోజనాలు చాలామట్టుకు 12 గం. ఆ ప్రాంతాల్లో జరుగుతాయి కదా! అటువంటప్పుడు లేతరంగు చీరలు కట్టుకొని, సాధ్యమైనంత తక్కువ నగలు ధరించితే బావుంటుంది. ఎందుకంటే ఎండలో వచ్చినవారు, మనవైపు చూస్తే చికాగ్గా ఉండకూడదు. ఈ లేతరంగులు కంటికి చల్లదనాన్నిస్తాయి. ఉద్యోగాల్లో ఉన్న స్త్రీలు, నేత చీరలు ధరించితే నిండుగా, గౌరవంగా ఉంటుంది. మనం చేసుకొనే అలంకరణలో ఇతరులకు ఎలాంటి వెకిలితనం కనిపించరాదు. నైలాన్, జార్జెట్లు, ధరించాలంటే అమ్మాయిలందరూ కలిసి సరదాగా పిక్నిక్‌లూ, పార్టీలు ఏర్పాటు చేసుకున్నప్పుడు వీటిని ధరించవచ్చు. ఈమధ్య కాటన్ నైలాన్‌లు వస్తున్నాయి. ఇవి మందంగా ఉంటాయి. కాబట్టి యివి కట్టుకున్నా ఎబ్బెట్టుగా ఉండదు.

ఇక బొట్టు విషయం .... నుదురు విశాలంగా ఉన్నవారు పెద్దగా గుండ్రని బొట్టు పెట్టుకోవచ్చు. కాని చిన్న నుదురు కలవారు పెద్దవి బొట్టు పెట్టుకుంటే వారి నుదురు మరీ చిన్నగా కన్పిస్తుంది. కాబట్టి అలాంటివారు చిన్న చుక్క పెట్టుకోవడం ఉత్తమం. చాలామందికి ముఖం మీది మొటిమలు ఓ పెద్ద సమస్యగా ఉన్నాయి. ఇలాంటివారు రోజా కస్తూరి పసుపుతో ముఖాన్ని శుభ్రం చేసుకోవాలి. రోజూ రాత్రి పడుకోబోయే ముందు ఈ పసుపును ముఖానికి పట్టించుకుని ప్రొద్దున్నే స్నానం చేసేటప్పుడు కడిగేసుకోవాలి అయితే సబ్బు వాడకూడదు. సున్నిపిండి రుద్దుకోవడం మంచిది. ఈ పసుపు ఎంత రుద్దుకున్నా పచ్చగా కనిపించదు కూడా! అందరికీ ఎలా ఉన్నా నాకు మాత్రం చాలా గుణం కనిపించింది. ముఖం తేటగా కాంతిగా ఉంటుంది. స్నో వాడితే మొటిమలు లేస్తాయని కొందరంటారు. ఇది ఎంత వరకూ నిజమో నాకు తెలియదు, ఎందుకంటే నేను స్నో వాడను కనుక. ఇక పెదవులు ఎర్రగా ఉండాలంటే లిప్‌స్టిక్కులు వాడటం. సినిమా తారలు మరీ నాగరికులకీ సరిపోతుంది కాని చాలా మంది ఇది వేసుకోవడానికి బిడియపడతారు. అలాంటి వారి మోజు తీర్చడానికి తాంబూలం ఉందిగా..... కన్నులలోనే మన హృదయమంతా ప్రతిబింబిస్తుంది అంటారు. కాబట్టి కన్నులను మనం సాధ్యమైనంత నిర్మలంగా ఉంచుకోవాలి. కళ్ళనిండా కాటుక పెట్టుకొని కొసలు తీర్చి దిద్దితే చేప పిల్లల్లా అటూ యిటూ పరుగులెత్తే ఆ కళ్లను చూస్తే మీనాక్షి అన్న పదం జ్ఞాపకం రాకమానదు.

---

మేనేజరు : మన గుమస్తాలు ఈ సంవత్సరం అన్ని శెలవులు ఉపయోగించు కున్నట్లు లేదే!

హెడ్ గుమస్తా : మన ఆఫీసులో లేడీస్‌ని ఎపాయింట్ చేసి. సరిగ్గా సంవత్సరం అయిందండి!

---

ఇక జుట్టు విషయం : మనలో రెండు రకాల కేశము లుంటాయి. వంకీల జుత్తు, సాఫీ జుత్తు. వంకీల జుత్తు కలవారు రెండు జడలు వేసుకుని కొసలు విడిచేస్తే సొగ్గా ఉంటుంది. కాని సాఫీ జుత్తువారు మాత్రం ఇలా చేస్తే అసహ్యంగా ఉంటుంది. అలాంటివారు శుభ్రంగా ఒక్క జడ వేసుకోండి! బావుంటుంది. ఇలాంటి జుట్టులో ఒక చికాకు ఉంది. సాఫీ కేశములను చివరివరకూ అల్లి విడిచేస్తే మాటిమాటికీ జడ వదులౌతుంది. ఇలాంటివారి కోసమే "జింగ్ జింగ్స్" అవతరించాయి. ఇవి బజార్లలో దొరుకుతాయి. పల్చని వెండిరేకు మీద చక్కని డిజైన్లు ఉంటాయి. క్రింద చుట్టూ చిన్న గజ్జెలుంటాయి. ఈ రేకును జడకు బిగుతుగా చుట్టివేస్తే జడ వదులవడమన్న సమస్య ఉండదు. మనం నడుస్తున్నప్పుడెల్లా ఈ గజ్జెలు చిన్నగా శబ్దించేస్తూ చాలా తమాషాగా ఉంటాయి.

జుట్టు పొడిపొడిగా, మెరుగ్గా ఉండాలంటే నిమ్మరసంతో దువ్వెనను ముంచి దువ్వుకొంటే వెంట్రుకలు కాంతివంతంగా ఉంటాయి. కనీసం వారాని కొక్కసారైనా తలంటి పోసుకోవాలన్న విషయం వేరే చెప్పక్కర్లేదుగా!

ఇంకా కొన్ని అలంకరణలు : ఇప్పుడు బంగారు మీద మోజు క్రమక్రమంగా తగ్గిపోతున్నది. ఇంకా తగ్గించుకోవాలనే కదా మన మొరార్జీగారు చెప్తున్నది కూడా! ఇప్పుడు వెండి నగలు ఫేషన్ అయ్యాయి. బంగారుగాజులున్నా కూడా ఇప్పుడు ఎవ్వరూ వేసుకోడంలేదు. రంగు రంగుల మట్టి గాజుల మీదికి పోతున్నాయి అందరి కండ్లూ. కంటికింపైన రంగుల్లో రకరకాల గాజు లొస్తున్నాయి. ఎడంచేతికి వాచ్ కట్టుకునేవారు కుడిచేతికి వారి చీర రంగుతో మాచ్ అయ్యే గాజులు వేసుకొంటే బావుంటుంది. అన్ని రంగుల్లోనూ గాజులు కొని పెట్టుకొని ఏ చీర కట్టుకొంటే ఆ రంగు గాజులు వేసుకొంటే బావుంటుంది. మాకు తెలిసిన ఒకామె తెల్లచీర కట్టుకుంటే ముత్యాల సెట్టు (నగల)తో పాటు తెల్లటి చెప్పులు, తెల్లటి గాజులు. తల్లో మల్లెలు పెట్టుకొంటుంది. పచ్చని చీర కట్టుకుంటే తల్లో చేమంతుల చెండు విధిగా ఉండాల్సిందే. ఇంత చక్కగా అలంకరించుకోవాలంటే శ్రద్ధ, ఓపికా కూడా ఉండాలనుకోండి. అయితే ఈ అలంకరణకు కూడా సమయాసందర్భాలున్నాయి. మన ఆప్తులకేదైనా కష్టం కలిగినప్పుడు ఓదార్చడానికి వెళ్లాలనుకోండి. అప్పుడు "ఈమె తన అలంకరణను చూపడానికి వచ్చిందా! లేక సానుభూతి చూపడానికా!" అన్న సందేహం ఇతరులలో రానియ్యకూడదు. అటువంటప్పుడు మన అలంకరణను ఎంత తగ్గించుకొంటే అంత మంచిది.

వీటన్నిటికన్నా ముఖ్యమైనది అంతఃసౌందర్యం. మాట, మన్ననా చక్కగా ఉన్నప్పుడే మనం రాణించగలం. హృదయం పవిత్రంగా లేకపోతే పెదాలపై చిరునవ్వు నిలవదు. కాబట్టి మనం చూపులో, మాటలో కూడా ఒకవిధమైన ఆకర్షణ కనిపింపజేసినప్పుడే మన వ్యక్తిత్వానికి పరిపూర్ణత సిద్ధిస్తుంది.



# వనితావాణి

## అనుమానం

నిజంగా మనలో చాలామందికి అనుమానమే అనండి; మతిమరుపే అనుకోండి సర్వసాధారణంగా ఉంటుంది. రచయిత్రి అనుమానము ఎందుకు వ్రాయువలసివచ్చిందో తెలియడములేదు. ఆమె వ్రాసిన ఉదాహరణలు సర్వసాధారణముగా అందరికి పరిచితమే. కాకపోతే అనుమానముల మీద, వాటి రకాలమీద ఇంకా కొంచెము ఎక్కువగా వ్రాసిఉంటే మాకు సోదరి శారద ఎందుకు ఈ వ్యాసము వ్రాసిందా అని అనుమానము రాకపోను.

పి. సుధ (విశాఖపట్టణము)

* * *

ఈ వ్యాసం వనితావాణికి ఉపయోగపడుతుందా అనే అనుమానం కలుగుతోంది.

జలసూత్రం రమాదేవి (బందరు)

* * *

శారదగారు అన్నట్లు 'పోస్టులో వేసిన ఉత్తరానికి', అడ్రసు వ్రాశానా అని, ఇంటికి తాళం వేసి పోయి, మరల వచ్చి చూసుకోటం ఇవి అనుమానం అనే బదులు "మతిమరుపు" అంటే బాగుంటుందని నా "అనుమానం".

శ్రీమతి గుండా జయలక్ష్మి (తుంగతుర్తి)

## వరుసలూ-వయస్సూ

ఇటువంటి అనుభవాలే నాకు రెండు మూడు చోట్ల జరిగినవి. ఇటువంటి పిలుపులు పిలిస్తే నాకు చాలా చికాకుగా ఉంటుంది. అలా పిలువ వద్దని చెబుదామంటే, మళ్లీ వాళ్లేమనుకుంటారో నని భయం.

లక్ష్మీతులసి (మంచిర్యాల)

* * *

సాధారణంగా ఇటువంటి దురలవాటు మన ఆడ వారిలోనే ఎక్కువగా ఉంటుంది. అటువంటివారితో మాట్లాడుట కూడా తప్పే అనిపిస్తుంది. మా ప్రక్కఇంటి ఆవిడ కూడా ఇలాగే 'అక్కయ్యా!' అని పిలుస్తుంది. మరి ఆవిడకు నలుగురు పిల్లలు కూడా ఉన్నారు. 'నీకన్నా చిన్నదాన్ని అలా పిలవచ్చా?' అంటే 'అబ్బే! అందులో తప్పులేదు; నాకు అలవాటు' అంటుంది. ఇటువంటివారి నేమనాలో అర్థముకాదు. ఎదుటివారు ఏమయినా అనుకుంటారన్న భావన కూడా ఉండదు వారికి. ఇలా పిలిచేవారి ధోరణి వినేందుకు ఎబ్బెట్టుగా ఉంటుంది.

దోర్నాదుల రాజేశ్వరి (నెల్లూరు)

# వంటలు

## పానకం

బెల్లం సుమారు పది తులాలు

చింతపండు { నిమ్మకాయంత సైజులో సగం

ఏలకులు 5 లేక 6

ఎండు అల్లం కొద్దిగా

ఉప్పు రెండు చిటికెలు

నీరు 4 కప్పులు

చింతపండు రసం తీసి, మిగతా నీరు చేర్చిన తర్వాత బెల్లం కరగబెట్టాలి. ఏలక్కాయలు, శొంఠిపొడి కలిపి, వడపోసి తాగాలి.

★

# చదువులరావు - బి. వి. సత్యమూర్తి

# కాశ్మీర్ బొకె టాల్క్‌తో గంటలుతరబడి సువాసనగా తాజాగావుండండి



అత్యద్భుతమైన, నాణ్యమైన
కాశ్మీర్ బుకె కొన్కాలు ఒక సౌందర్య
టాల్క్... ఒక బేబీ పౌడరు

పూల గుచ్ఛంలోనికి చొచ్చినట్టు
గావుంటుంది, కాశ్మీర్ బుకె టాల్క్
యొక్క చల్లని, పూలరేకు వంటి
మెత్తదనాన్ని అనుభవిస్తే. వొళ్లు
అంతా రాసుకొనండి, నవ వసంతపు
ఘుమఘుమలతో రాజిల్లుతారు.



శిశువును సంతోషంగా
సౌఖ్యంగా వుంచండి!
కాశ్మీర్ బుకె ప్రతి యితర
ప్రత్యేక బేబీ పౌడరువలె
మెత్తగా, సున్నితంగా
వుంటుంది. మీ ఇద్దరూ
ఉపయోగించగల ఒకే
పౌడరు అందు బాటులో
వుండటం ఎంత వీలు!




# కాశ్మీర్ బొకె

పురుషులు వాంఛించే సువాసనగల టాల్కం పౌడరు

CB-S 19-TEL.



# హమేషా తమాషా





కిరసనాయిలు కర్రువు వచ్చింది. బంగారం పూర్తిగా లేనేలేదు. ఉప ఎన్నికల్లో పార్టీకి మద్దతు కావాలి? ఔనా ??

* * *

## లాజిక్ లోని మ్యాజిక్

ఒక అక్క—తమ్ముడు, తన బావగారిని అనగా సదరు అక్కమొగుణ్ణి బజారుకు తీసుకొని వెళ్ళాడు. అక్కడ ఇంకో శాస్త్రి కనబడి "ఎవరీయన" అని ప్రశ్నించాడు.

"నా మొగుడు" అని తికమకని సమాధాన మిచ్చాడు.

ఆ శాస్త్రి గుడ్లు తేలవేసి "నీకేం పిచ్చా, లేక పోతే ఈయన నీకు మొగుడేమిటి" అన్నాడు.

"అయితే కొన్ని ప్రశ్నలడుగుతా చెప్పు; మా అక్కతండ్రి నా కేమవుతాడు?"

"తండ్రి."

"మా అక్కతల్లి?"

"తల్లి."

"మా అక్క అన్న?"

"అన్న."

"మామ?"

"మామ."

"అత్త?"

"అత్త."

"మా అక్క మొగుడు ?"

"మొగుడు అని నాలిక్కరచుకొని "బావ" అన్నాడు.

"అదెలాగయ్యా? రెండు ఒకట్లు రెండు; రెండు రెండ్లు నాలుగు, రెండు మూళ్ళు ఆరు, అయినప్పుడు, రెండు నాలుగులు ఎనిమిది కాక తొమ్మిదవుతుందా?"

పాపం! జవాబు చెప్పలేని సదరు ఆసామి అక్కడ నుంచి జారుకొన్నాడు. జి. నరసింహమూర్తి.

## మీ పర్సనాలిటీ ఎంత?

గోంగూర పచ్చడి నయించదూ?
బాప్ రే! ఆంధ్రుడివే?
(వాళ్లు ఐతరేయ బ్రాహ్మణంలో
ఉన్నారు లే! మనవాళ్లే!)
ఇంకా నయం సిగరెట్లు కాల్చలేవూ?
కథలూ కవిత్వమ్ ఎలా రాస్తావ్?
ముక్కటోణా 'బ్లాక్'గా సినీటిక్కెట్
కొనుక్కోలేవూ?
మై గుడ్నెస్! సినీమాలంటే క్రేజు
లేకుండా యూనివర్శిటీలో ఎలా
చదూకొన్నావ్?

మాగజీనులో అందాలతారబొమ్మకి
మీసాలు గీయలేవూ?
బొత్తిగా ఆర్టిస్టిక్ టేలెంట్ లేదన్న
మాట!
పైగా తెనుగుపేపర్ శ్రద్ధగా
తెలుగు వార్తలు బుద్ధిగా చదవడం
వినడం కూడానా?
డామిట్? నాగరికత ఇకెంలా
అబ్బుతుంది బాబూ!

[—వీరాజీ.]

## అల్లుడు

ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటి కా కోర్కె కోరి మామల మనసుల్
నొప్పించియు, తా నొవ్వక
తప్పించుక తిరుగువాడె అల్లుడు సుమతీ!

అట్లూరి నాగేశ్వరరావు (పెదతుమ్మిడి)★



"వనితావాణికి ఉత్తరాలు రాయడం తగ్గించబోతున్నా — పోస్ట్‌కార్డ్ రేటు పెంచారుటగా!"

చిన్న కోతలను,
గాయములను
మరియు
దెబ్బలను



జాన్సన్స్

# బ్యాండ్-ఎయిడ్

## ప్రథమ చికిత్స పట్టీలతో కప్పండి!

బ్యాండ్-ఎయిడ్ ప్రథమ చికిత్స పట్టీలు

- రోగ క్రిములను అంటనీయవు
- గాయములను నీరు పట్టకుండా మరియు శుభ్రముగా ఉండేలా ఉంచును
- గాయములను త్వరగా మానేలా చేయును
- చర్మమునకు గాలిని తగలనీయును
- ఒక్కక్కటే విడివిడిగా ప్యాకు చేయబడినవి... తీసుకొనిపోవుట సులభము ... ఉపయోగించుట తేలిక







బ్యాండ్-ఎయిడ్ ప్రథమ చికిత్స పట్టీలను
ఎల్లప్పుడూ సిద్ధముగా ఉంచుకోండి!

జాన్సన్ & జాన్సన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్

JWT-JJ-4742

**జాతీయ సేవకు రెడ్ క్రాస్‌లో చేరండి!**

డేవిడ్ ఎట్రిక్:

# జంతువులు ఆలోచించగలవా?

**ఒక డాల్ఫిన్ (Dolphin)కి చిన్న యంత్రం తగిలించి అట్లాంటిక్ సముద్రంలో సుమారు నూట ఎనభయ్ అడుగుల క్రింద ఈదేట్లు చేస్తామనుకోండి.**

ఇంతలో, డాల్ఫిన్ హఠాత్తుగా చీకటిలో ఎనిమిది, తొమ్మిది మైళ్ల అవతల ఏదో వస్తువు కదులుతున్నదని కనిపెడుతుంది! నూరుమైళ్ల అవతల ఒక పెద్ద మిలిటరీ నావలో ఈ రిపోర్టు వస్తుంది:

"డాల్ఫిన్ చార్లీ రిపోర్టు చేసేది: పరమాణు అస్త్రాలు కల సబ్ మారీన్ వంటిది ఒకటి తొమ్మిది మైళ్ళ అవతల, 85 డిగ్రీలుగా సమీపిస్తున్నది....."

నమ్మేటట్లు లేదు కదా!

కాని, అంత నమ్మలేనటువంటివిషయం కూడా కాదేమో!

ఒక అమెరికన్ శాస్త్రజ్ఞుల బృందం దానిమీద పరిశోధనలు జరుపుతున్నారు. సబ్‌మారైన్‌ల (జలాంతర్గాములు!) ను కనిపెట్టే సాధనాలలో డాల్ఫిన్‌లు అతి ముఖ్యమైనవిగా ఉండగలవేమో నని వారి ఊహ.

ఈ వింత—మృగాలను గురించి కొన్ని కొత్త సంగతులు తెలుస్తున్నాయి. ఇంకా ఇటువంటి ఆశ్చర్యకరమయిన విషయాలు ఎన్ని తెలుస్తాయో, అనుకుంటున్నారు ఈ శాస్త్రజ్ఞులు.

డాల్ఫిన్‌లు తెలివయిన జంతువులు. వాటి మెదళ్ళు చాలా పెద్దవి.

డాల్ఫిన్‌లు చాలా విషయాలు కోతులకన్నా తొందరగా నేర్చుకుంటాయి. ఈ సంగతి వర్జీనియా ద్వీపాలలో ఒక కేంద్రంలో జరిపిన పరిశోధనల ద్వారా తెలుస్తున్నది. ఒక ఈల తర్వాత రెండు ఈలలు వేసి వినిపిస్తే, కొంతసేపు తర్వాత నాలుగు ఈలలు కూడా ఎదురుచూస్తాయట! అంటే, ఒక ఈలకి ఒక ఈల సమాధానంగా వేయించడమే కాక, రెండు ఈలలకు రెండు ఈలలు సమాధానంగానే వేయడం వాటికి నేర్పారన్నమాట, మేంటట.

డాల్ఫిన్‌లు వాటిలో అవే శబ్ద ప్రసారాల ద్వారా "మాట్లాడుకో"గలవు. మనుష్యుల మాటలను గుర్తుపట్టి వివిధ వ్యాయామాలు చెయ్యగలవు.

మన భాషలను సయితం అనుకరించగలవు. వీటిని టేప్ రికార్డర్ మీద రికార్డ్ చేసి వింటే వాల్ట్ డిస్నీ కార్టూన్ సినిమా సంభాషణ విన్నట్లు ఉంటుంది.'

కాని మన భాష వాటికి నిజంగా అర్థం అవుతుందా? మనం చెప్పినవి అర్థం చేసుకుని తక్కిన డాల్ఫిన్‌లకు చెప్పగలవా? పోనీ, వాటి భాష మనం మాట్లాడగలమా?

సబ్‌మారీన్‌లను కనిపెట్టే నైపుణ్యం డాల్ఫిన్‌లకు ఉంది. వాటి వినికిడి శక్తి చాలా నిశితమయినది. మైళ్ళ అవతల నున్న వస్తువులను కనిపెట్టగలవు. వీటి చెవులకు సరిపోయిన యంత్ర సాధనాలు ఇంతవరకూ ఏ ఇంజనీరూ నిర్మించలేదు.

ఇవి సాధారణంగా నిద్రపోవు. తిరుగుతూనే తింటూ ఉంటాయి. 24 గంటలూ మేలుకుని ఉండగలవు.

**కేంబ్రిడ్జ్ యూనివర్సిటీలో కోతుల 'భాష'మీద క్షుణ్ణమయిన పరిశోధన జరుపుతున్నారు. మొత్తానికి ముప్ఫయ్ 'శబ్దసంజ్ఞలు' ఉన్నాయని తేలినట్లు కనిపిస్తుంది.**

అంటే ఒక పాత ప్రశ్న తిరిగి గుర్తుకు వస్తుంది: 'జంతువులు ఆలోచించగలవా ?'

ఎవరిదో ఒక పిల్లి 200 మైళ్ళు నడిచి పాత ఇంటికి వచ్చేసిందిట. ఒక కుక్కకి ప్రతి మాటా అర్థం అయ్యేదిట; ఒక చేపకి భోజనంవేళ ఎప్పుడో తెలుసుట; ఇటువంటివి ఎన్ని వినటంలేదు!

అయితే, ఇవన్నీ అబద్ధాలు అని పూర్తిగా తోసి వేయటానికి వీలులేని సాక్ష్యం పెరుగుతున్నది.

ఏనుగులు ఏదీ మర్చిపోవంటే ఎందరో నమ్మేవారు కాదు కాని, కొందరు జర్మన్ శాస్త్రజ్ఞులు ఇది నిజమేనని నిరూపించారు.

ఒక అంధుదేశ ఏనుగుకి కొన్ని గీతల బొమ్మలు చూపించారు. సంవత్సరం గడిచిన తర్వాత అదే బొమ్మ చూపగా తేలికగా గుర్తుపట్టింది. అంతే కాక, సంఖ్యలు నేర్చుకో గలిగింది!

చివరికి సంగీత స్వరాల మధ్య భేదాలు కూడా గ్రహించగలిగింది. చాలామంది మనుష్యులకే తెలియని ఏ భేదాలను కూడా గుర్తించగలిగిందిట.

ఈ ఏనుగకి విసుగు తక్కువ! దీనికి పాఠాలు నేర్పి నేర్పి గురువులే విసుగు చెందారు. వీరు మాని వేసేసరికి ఏనుగకి 24 శబ్దాలు—మనుష్యులు చేసేవి—గుర్తుపట్టే నేర్పు అలవడింది.

ఒక జీబ్రాకి 10 జతల ఆకారాల మధ్య భేదాలు తెలిశాయి. ఒక గాడిదకి 13, ఒక గుర్రానికి 20 తెలిశాయి.

చింపాంజీ కోతులకు చిత్రాలు వెయ్యటం వచ్చు. బుద్ధిబలం ఉపయోగించే ప్రతిపని వాటికి చాలా ఇష్టం.

**లండన్ జూ (జంతుప్రదర్శనశాల/జంతుశ్రయం)లో 'కాంగో' అనే చింపాంజీ ఉంది. ఇది ఎన్నో బొమ్మలు వేసింది. దీని బొమ్మలు పికాసో, జూలియన్ హక్స్‌లీలు తమ ఇళ్లలో గోడలకి తగిలించుకున్నారు!**

బొమ్మలు వేస్తున్నప్పుడు దాని ఏకాగ్రతకు భంగం కలిగితే రెచ్చిపోయేది. భోజనం సంగతి సైతం మర్చిపోయేది.

కాంగో మొత్తం 400 పటాలు వేసింది. ఇవేవీ అల్లాటప్పా గీతలు కాదు. కొన్ని సుప్రసిద్ధ చిత్రకారుడు వాన్‌గో శైలిని పోలి ఉంటాయి. కొన్ని చిన్న పిల్లల బొమ్మలను పోలి ఉంటాయి. అతి ప్రాచీన కాలాలలో మానవుల బొమ్మలను పోలి ఉంటాయి ఇవి.

కాని క్రమంగా కాంగో స్వభావం మారిపోయింది. తిక్కపుట్టి రంగులు గీసే క్రేయాన్‌లను తినటం మొదలుపెట్టింది. చుట్టూ ఉన్న వస్తువులు విరగకొట్టేది.

ఇది విచారించతగ్గ విషయం. అప్పుడప్పుడే కొంచెం నైపుణ్యం అలవడుతున్నదనగా ఇలా జరిగింది.

కొన్ని ఇతర వానరాలు పెన్సిల్ పేపర్‌ల కోసం మొత్తి పెత్తి బొమ్మలు గీసేవి. ఇవి దొరకకపోతే నకులమీద గీసేవి. రోటర్‌డాం జూలో సోఫీ అనే గొరిల్లా వేసే గీతల విశిష్టతకు నిపుణులే ఆశ్చర్యపోయారు.

**కాని 'టాఫీ' అనే ఒక నల్లపిల్లి (వయస్సు 2½ సం) వేసిన బొమ్మ ఎవరికయినా ఆశ్చర్యం కలిగిస్తుంది: గుర్రంమీద మనిషి కూర్చున్న బొమ్మ వేసింది!**

కోతులకి చాలా విషయాలలో ప్రావీణ్యం ఉంది. వికీ అనే ఒక అమెరికన్ చింపాంజీకి పానీయాల ప్రకటనలు చూపిస్తే సరియైన బొమ్మలు చూపించగలిగేది. వంటింట్లోకి తీసుకుని వెళ్తే దాకా 'కప్' అనే శబ్దం చేసేది.

మలయాలో ప్రచ్, జంబుల్ అనే గాడిదలు రెండు ఉన్నాయి. వీటిని అక్కడ సివిల్ సర్వీస్‌లో 'వృక్ష శాస్త్రజ్ఞులు'గా చేర్చారుట. ఒక కేంబ్రిడ్జ్ ప్రొఫెసర్‌గారు పరిశోధనలు చేసేవాడు. ఆయనకి ఇవి అవసరం వచ్చి ఈవిధంగా గవర్నమెంటు నిబంధనలకు సరిపోయే వర్ణన ఇచ్చి ఉంటాడు. చెట్ల కొమ్మలు విరగ్గొట్టటానికి, ఆకులు రాల్చటానికి, కాయలు విదల్చటానికి ఈయనకి సాయపడేది.

"ఇదేనా ?" అన్నట్లు ఒక్కొక్క చెట్టు దగ్గరా ఆగి అభినయం చేసేవి. "అవును అని ఈయన చెప్పగానే చెట్టు వదిలేవి. విసుగు,

44 వ పేజీ చూడండి

"రమేశ్, కాలేజీకి టైమవుతోంది లేవరా బాబూ. తగు వాత ఊరికే హడావిడి చేస్తావు. కొంచెం ముందిరగా లేస్తే అన్నీ నెమ్మదిగా చేసుకోవచ్చుగా. ఓ రమేశ్ ..."

శాంత రమేశుడి మంచందగ్గర నిలబడి అతడిని లేపే ప్రయత్నంలో ఉంది. రమేశుడు నిండా దుప్పటి కప్పుకుని పడుకున్నాడు. ముసుగులో నుండి కొంచెం ఉంగరాల జుట్టు మాత్రం కనిపిస్తూంది.

శాంత ప్రయత్నం ఫలించలేదు.

"నాలుగేళ్లుగా మెడికల్ కాలేజీలో చదువుతున్నా, ఇంకా ఉదయం త్వరగా లేచే అలవాటు లేకపోతే ఎలా? సిగ్గుచేటు! నువ్వేం పసిపిల్లాడివా ఏం, రోజూ నిన్ను లేపటానికి? రేపటినుండి అసలు నిన్ను లేపనే లేపను....."

తన ఆఖరిమాట నిజంకాదని ఆమెకే తెలుసు. ఆమెకే ఏమిటి, రమేశుడికి కూడా తెలుసు. రమేశ్ మెడికల్ కాలేజీలో చేరినప్పటినుండి శాంత రోజూ ఈ మాట చెపుతూనే ఉంది. కాని అతడిని లేపే బాధ్యత మాత్రం ఆమెదే. కావాలనే శాంత ఈ బాధ్యతను స్వీకరించింది. ఈ కార్యక్రమం ఆమె కెంత ప్రియమయిందో, వదిన మందలింపులు, తిట్లు వింటూ లేవడం రమేశుడికీ అంతే ప్రియమయింది.

రమేశ్ మెడికల్ కాలేజీలో చేరాక రెండు సంవత్సరాలకు హాస్పిటల్—డ్యూటీ ప్రారంభమయింది. రమేశ్ ఇంటికి రాగానే:

"వదినా, రేపటినుండి నన్ను లేపే బాధ్యత మీదే" అని వదినమీద భారమంతా పడవేసి నిశ్చింతగా ఉండిపోయాడు. అప్పటినుండి శాంత ఒక్క రోజు కూడా విసుక్కోకుండా అతడిని లేపేది.

"ఆరు—గంటలకల్లా లేపకండి. ఆరుంబావుకు సరిగ్గా లేపండి. తరువాత ఆరు గంటలకే లేపి, నా నిద్ర పాడుచేస్తే ఊరుకోను" అని ఖచ్చితంగా చెప్పేఉంచాడు రమేశ్.

ఆరు—గంటలు కాగానే రమేశుడి గదిముందు నిల్చుని కర్టెన్ పక్కకు జరిపి చూసేది.

"పాపం, నిద్రపోతున్నాడు. మరికొంతసేపు పడుకోనీ" అనుకుంటూ వెళ్లిపోయేది. ఆరూ ఐదు నిమిషాలకు మళ్లీ గదిలోకి వెళ్లి కిటికీ తలుపులు తెరచి మెల్లిగా 'రమేశ్' అని పిలిచి వెళ్లిపోయేది. ఆరూ పదికి మళ్లీ వచ్చి ఈమారు నిజంగానే లేపడం మొదలెట్టేది. ఎన్నోమార్లు మేలుకునే వదినను ఏడిపించే ఉద్దేశ్యంతో లేవకుండా పడుకునే వాడు రమేశ్. వదిన చేతి గాజుల చప్పుడుకే అతడికి మెళకువ వచ్చినా, ఆమెచేత తిట్టించుకోవడము, బ్రతిమాలించుకోవడం కోసమే ఆరుంబావు వరకూ మెదలకుండా పడుకునేవాడు.

ఈరోజూ అలాగే కదలకుండా పడుకున్నాడు. కాని తన దొంగ—నిద్రకు తనకే నవ్వొస్తోంది.

"ఇకమీదట నిజంగా నిన్ను లేపను. ఇంతటి బద్ధకస్తుడు మెడికల్ కాలేజీలో ఎందుకు చేరాలసలు? నీకేం నిశ్చింతగా ఉన్నావు. నువ్వు ఫేలయితే మాట వచ్చేది నాకేగా! ఇకమీదట నాకూ, నీ చదువుకూ ఏమీ సంబంధం లేదు. చెబుతున్నా మరి. ఇహ నీ యిష్టం. మీ అమ్మా, నాన్నా, అన్నయ్య వాళ్లిష్టం. ఎవ్వరికీ లేంది నేను మాత్రం ఎందుకు నా తల పగలకొట్టుకోవాలి? మొదటిలా చిన్న కుర్రాడివయినా అయితే తన్ని లేపవచ్చు. నాకంటె రెండింతలు పొడుగ్గా పెరిగి నిల్చున్నావు....."

మంచంమీద మనిషి కదలటంతో శాంత వాక్ప్రవాహం ఆగింది.

"అమ్మయ్య, ఇప్పటికయినా లేచావుకదా. నువ్వు మెడిసిన్ పాసయితే నా భుజంమీది బరువు దించి నట్టవుతుంది. ఆరోజు హనుమంతుడికి ఓ కొబ్బరి కాయ కొడతాను."

"ఏ హనుమంతుడు" అంటూ లేచి కూర్చుని రమేశ్:

"ఏ హనుమంతుడు? రాముడి కొడుకు హనుమంతుడేనా?" అన్నాడు.

"కొడుకు కాదు; సేవకుడు" అని దిద్దింది శాంత.

కథకుడు: ఈ కథ మీ పత్రికలో వేసుకుంటారని ఆశతో పట్టుకొచ్చానండి. మొదటినుంచి మంచి సస్పెన్స్‌తో నడుస్తుందండి. హాస్యం, శృంగారం, విషాదం అన్నీ కలిసి...

ఎడిటర్: సరేలెండి. తిప్పి పంపడానికి స్టాంపులు కూడా అతికించారా?

"ఇంకా గంట ఆరు కూడా కాలేదు. అప్పుడే నన్ను లేపేశారు అనవసరంగా" అని విసుక్కుంటూ గడియారంవైపు చూశాడు రమేశ్.

"చూడరా బాబూ, చక్కగా కళ్లు తెరచి చూడు. దేవుడు నీకు పెద్ద పెద్ద కళ్లిచ్చాడు. బాగా ఉపయోగించు" అంది శాంత.

"రాత్రి తొందరగా పడుకుందామని ఇరవై నిమిషాలు ముందుకు పెట్టాను."

"నీ గడియారం చూసుకునేం లేపటంలేదు నేను. నా గడియారం వేరే ఉంది."

"తమరి గడియారం ఏటో చెబుతారా, వదిన గారూ?"

"సూర్యుడికన్నా గడియారం కావాలా ఏం? ఈ ప్రపంచంలోని గడియారాలన్నీ చెడిపోయినా నేను కరెక్ట్ టైం చెప్పగలను. అయినా మీ అన్నయ్య నాకు గడియారం కొనిపెట్టనంత మాత్రానా నాకు టైం తెలీక పోతుందనుకున్నావా?"

"అనవసరంగా అన్నయ్య నంటూ రెండుకు వదినా? అన్నయ్య ఇనప్పెట్టె తాళంచెవులు ఎవరిదగ్గరున్నాయో నాకు తెలుసు."

"తాళంచెవులు ఉంటే వచ్చిందా భాగ్యం? ఈ నెలలో ప్యాంటు, వచ్చే నెలలో కోటు, మరో నెలలో ఇంకోటి.... ఇలా చెప్పుంటే, నేను వాచి కొనుక్కున్నట్టే ఉంది."

"ఈ నెల మీకేమీ లేదు; నేను వాచి కొనుక్కుంటానంటే అన్నయ్య మిమ్మల్ని కొడతాడా ఏం?"

"ఆఁ ఇహ అదొక్కటే తక్కువ. నువ్వు ఇక లే. కాఫీ చల్లారిపోతుంది. వేడిచేస్తే బావుండదు మరి. బ్రెడ్డు తింటావా, బిస్కట్లు ఇమ్మన్నావా?"

"రెండూ; వానితోబాటు కొంచెం వెన్న కూడా."

"అమ్మ మళ్లీ నన్ను అంటారు బాబూ, తెచ్చిన వెన్నంతా రెండు రోజుల్లోనే అయిపోయిందని. అమ్మకే వైరు—కొట్టి వెన్న తీసుకో."

"మీరు ఇస్తారా లేదా చెప్పండి" అంటూ మంచం దిగి, నిల్చుని వళ్లు విరుచుకున్నాడు రమేశ్.

"సరే, త్వరగా రా" అంటూ వెళ్లిపోయింది శాంత.

రమేశ్ తన పనులన్నీ ముగించుకుని కాలేజీకి వెళ్లటానికి సిద్ధమై గుమ్మం దగ్గర కొచ్చాడు.

బూటు—శబ్దం విని, శాంత గాజుపళ్ళెంలో బ్రెడ్డు, బిస్కట్లు, వెన్న పెట్టి రమేశుడి కిచ్చింది. అతడు నిల్చునే తినబోతుంటే:

"కూర్చుని తినరా బాబూ" అంది.

"వీల్లేదు, టైమయిపోయింది."

"ఊరికే నన్ను ఆక్షేపిస్తావు గాని, ఎప్పుడనగా లేపాను నిన్ను. ఇప్పుడు టైమయిపోతోందని రాగం తీస్తున్నావా? నిల్చుని తినటం మంచిది కాదబ్బాయ్".

"అలాగని ఏ పుస్తకంలోనూ రాసి లేదు మరి."

"దానికి పుస్తకమెందుకోయ్? నన్నడుగు చెపుతాను. అలా నిల్చుని గబగబా తినటం వంటికి మంచిదికాదు."

"ఆడవాళ్లు ఎక్కువగా మాట్లాడటం ఏమంత మంచిదికాదు" అంటూ, రమేశ్ కాఫీ ఒక్క గుక్కలో తాగేసి తొందరగా బయటికి వెళ్లిపోయాడు. ఇంకో నిముషంలో అతడి సైకిల్, రోడ్డు మలుపు తిరిగి మాయమయింది.

అతడు ఇంకొక్క నిముషం అక్కడ నిలబడి శాంత మొహం చూసిఉంటే, తన మాటతో ఆమె నెంత బాధపెట్టాడో తెలిసేది. సుమారు పన్నెండేళ్లుగా అతని స్వభావంతో పరిచయం ఉన్నా, ఎన్నో మార్లు అతడి దుడుకు మాటలకు శాంత చిన్న బుచ్చుకునేది.

రమేశుడిది నిర్మల — హృదయం. అందులో తనను కించపర్చాలనే భావం ఏమాత్రం లేదను విషయం శాంతకు తెలుసును. కాని అతడి దురుసుతనంవల్ల, ఆ మాటల తీక్ష్ణతను తట్టుకోవటం సూక్ష్మమతియైన శాంతకు కష్టమనిపించేది.

చేదు—మాత్రను శాంతచేత మింగించి, రమేశుడు వెళ్లిపోయాడు. ఇహ మళ్లీ అతను రావటం సాయంకాలం ఐదు గంటలకే. అప్పుడు కూడా హడావిడిగా కాఫీ, టిఫిన్ తీసుకోగానే, స్నేహితులతో షికారుకు వెళ్లిపోయేవాడు. ఇక మళ్లీ దర్శనం రాత్రి ఎనిమిది దాటాకనే. రాత్రి భోజన సమయంలో మళ్లా వదినా, మరుదుల మధ్య మాటా మంతి, జగడం—అన్నీ మళ్లీ ప్రారంభమయ్యేవి.

రమేశ్ వెళ్లిపోయాక ఎంతోసేపు శాంత అలాగే నిలుచుని ఉండిపోయింది.

41-వ పేజీ చూడండి

రంగాపురం మేజర్ పంచాయతీ ఆఫీసు చుట్టూ జనం కిటకిట లాడుతున్నారు. అందరి దృష్టీ ఆఫీసుముందు వెదురు గడకు కట్టిన మైకుపైపే సారించి ఉంది. ఒక్కొక్కడు ఊహాగానాలు చేయటంలో తన ఎదుటివాడిని మించిపోతున్నాడు. ప్రతివాడూ నూటికి నూరుపాళ్ళు తను చెప్పిన అభ్యర్థే గెలవటం ఖాయం అని వినేవారికి బోధపరుస్తున్నాడు. అందరూ తమ అభిప్రాయాలను యితరులకు వినిపించాలనుకొనే వారే; వినేవారు మచ్చుకైనా కనపడటంలేదు.

ఇంతలో పంచాయతీ ఆఫీసులోనుండి ఒక వ్యక్తి, మొఖంమీదనుండి కారే చెమటబొట్లను ఖండువాతో తుడుచుకుంటూ ఎగరొప్పులు రొప్పుతూ రోడ్డుమీద కొచ్చాడు. జనం అతణ్ణి చుట్టివేశారు. "ఏమిటీ విశేషం! ఎవరికెన్ని వోట్లు వచ్చాయి" అంటూ, తలా ఒకప్రశ్న కుప్పించివేశారు. అతడు తీరిగ్గా దగ్గి, చిరునవ్వుతో తనచుట్టూ మూగిన జనాన్ని చూశాడు. ప్రతివాడి ప్రాణం కొట్టుమిట్టాడింది. అతడేమి చెపుతాడో నని కుతూహలంతో రెప్పలార్పకుండా చూస్తున్నారు. ఆ వచ్చిన ఆసామీ: "ఇంకా లెక్క ముగియలేదు" అన్నాడు. అందరి ప్రాణాలు ఉసూరుమన్నాయి.

"అయితే ఎంతవరకు వచ్చింది లెక్క?" ఊపిరి పోసుకొని అడిగిందొకప్రాణం.

"తొందరలోనే వింటారుగా— నన్ను కొంచెం బయటకు పోనీయండి."

"వీడెవడ్రా, ఉసూరుమయ్యాలాగున్నాడు. లోపల్నించి పెద్దపోటుగాడులా వస్తున్నాడు; లెక్క తెలియదంట— లెక్క". ఒక గడుగ్గాయి పిండం వాగింది.

"ఎవరయ్యా నువ్వు? ఏమిటీ అంటున్నావు? మళ్ళా అను" అన్నాడు లోపలినుండి వచ్చిన వ్యక్తి, కోపంగా ఆ గడుగ్గాయివేపు చూస్తూ.

"ఎంతవరకు వచ్చింది లెక్కఅంటే చెప్పకుండా ఏమిటయ్యా— అరుస్తున్నావు. పైగా వెకిలినవ్వొకటి నీవూనూ." నలుగురూ నాలుగు మాటలు అడిగేశారు ఆసామీని.

"ఇప్పటివరకూ మనవాడిదేనయ్యా మెజారిటీ. ఐదొందల మీదుంది లెక్క."

జనమంతా ఒక్కసారి తెల్లబోయారు. 'ఇంతకూ, మనవాడే నంటే ఎవడూ?' అనే ప్రశ్న అందరి మొఖాల్లోనూ తాండవించింది.

"మనవాడంటే ఎవడయ్యా? నీ వే గ్రూపువాడివి?" మళ్ళీ ప్రశ్నల వర్షం కురిసింది.

ఆ ఆసామీ కాస్త విసుక్కున్నాడు. ఎంత చెప్పినా

వీరికి అర్థంకాదేం అనే చూపు అందరివేపూ విసిరేసి, తాపీగా "వింటారుగా కొంచెంసేపటికి—వైకుంఠ" అంటూ, మూగిన గుంపును నెట్టుకుంటూ వెళ్ళిపోయాడు.

"బడా పెద్దమనిషి ! మనల్ని పెద్ద 'సస్పెన్సులో' పెట్టాడు."

"పెద్ద దేశనాయకుళ్ళాగా వచ్చాడు. ఒకముక్క చెప్పలేదు. పైగా లాల్చి—వీడూనూ !"

"ఉట్టి దేభ్యంగాడు. తనకు తెలియకపోతే తెలియదని ఏడవరాదూ. పెద్ద తెలిసినట్లు మళ్ళీ ఒక పోజు."

అనవలసిన మాటలన్నీ అయిపోయినాక గుంపు చెదరిపోయింది. ఇద్దరిద్దరూ, ముగ్గురు ముగ్గురుగా చీలిపోయి అంతా మళ్ళీ సంభాషణల్లో పడిపోయారు.

పకోడీల పరమయ్య కొట్టు పక్కగా రెండు కాళ్ళూ ముడుచుకొని కాళ్ళచుట్టూ చేతులు చుట్టేసి, బిక్కమొహంతో కూర్చున్నాడు చెప్పుల షాపు కనకాయ్.

ఊళ్ళో పెద్దమనుషులు పదిమంది వచ్చి, పదే పదే చెప్పినమీదట తమ వాడలో రిజర్వు సీటుకు పోటీ చేశాడు కనకాయ్. అంతవరకూ ఆ సీట్లో కనకాయ్—మామ తిరపతయ్య ఉండేవాడు. ముందుగా కనకాయికి మెంబరుగా నిలబడదామనే భావం కలిగలేదు. తన చెప్పుల షాపులో ఆనవాయితీగా చెప్పులు కుట్టించుకునే పెద్దలు ఒక్కరొక్కరూ చెప్పగా చెప్పగా పోనీ, ఒకసారి నిలబడి చూస్తే ఏమిపోతుంది అనుకున్నాడు. పెళ్ళాం గౌరమ్మతో ఆ మాటే అంటే, "ఏదో మానాన బతుకు వెళ్ళబోసుకుంటున్న మనకెందుకీ నిలబడటం" అంది. అంతటితో ఊరుకున్నాడు కనకాయ్.

రోజురోజుకూ ఎన్నికలు దగ్గర పడుతున్నాయి. నామినేషన్లు వేసే గడువు మరో పదిరోజులు ఉంది. బియ్యంకొట్టు మల్లయ్యగారు, ఫ్యాన్సీషాపు నిత్యానందంగారు, కమీషన్ దుకాణం గురునాథంగారు, విశ్వేశ్వరశర్మగారు — అందరూ కలిసి ఒక రాత్రిపూట గూడెం వచ్చి, కనకాయిని పేరుపెట్టి పిలిచారు. ఎవరూ అంటూ తలుపుతీసిన కనకాయ్ వాళ్ళని చూసినవెంటనే క్షణంసేపు తెల్లబోయాడు. కొంచెం సేపటికి తెప్పరిల్లి అందరికీ దండాలు పెట్టి నిలుచున్నాడు.

"నీతో కొంచెం పనిఉండి వచ్చామురా కనకాయ్" విశ్వేశ్వర శర్మగారు ముందుగా మాట్లాడారు.

"పని ఉంటే, యింతమంది దొరలంతా కలిసి ఈ గూడెంలోకి రావాలా దొరా ! తమరు కాకితో కబురుచేస్తే మీ వద్దకు రెక్కలు కట్టుకొని వచ్చి వాలనూ !" అన్నాడు చేతులు కట్టుకుంటూ కనకాయ్.

"ఇటు రా, కనకాయ్. కొంచెం ఆ చెరువు కట్టకేసి పోదాము— మాట్లాడే సంగతులు చాలా ఉన్నాయి" అన్నాడు గురునాథంగారు.

"పదండి దొరా! మీ రెక్కడికి పోదామంటే అక్కడికి వస్తా" అంటూ, వారందరికీ ప్రక్కగా నడుస్తూ దారితీశాడు కనకాయ్.

"ఇంతమంది కలసికట్టుగా గూడెం ఎందుకు వచ్చారబ్బా ! ఇంత పెద్ద ఆసాములకు నాతో మాట్లాడే పని యేమొచ్చిం"దనుకుంటూ తికమక పడిపోతున్నాడు కనకాయ్.

అందరూ చెరువుకట్టమీద ఆంజనేయ దేవాలయం దగ్గర అరుగులమీద చతికిల పడ్డారు. కనకాయి అరుగులకు దిగువభాగంలో బండమీద కూర్చున్నాడు.

"నీవు మాకో మాట ఈయాలి కనకాయి. ఆ తరువాత జరిగే సంగతులు మేము చూచుకొంటాము" అంటూ ప్రారంభించాడు శర్మగారు.

కనకాయికి ఏమీ అర్థంకాలేదు. "ఏమిటి శర్మగారనేది? నే నేం మాటనీయాలి ? తరువాత వీరు చూచుకునేదేమిటి ?" అని మనసులో చాలా మథనపడిపోయాడు.

"మీరు చెప్పింది నేను కాదనే పాటివాడనా దొరా ! ఏమి కావాలో చెప్పండి. నా చేతనయితే చిటికెలో తీసుకొచ్చి మీ పాదాలముందు పడేస్తా" అన్నాడు.

"కనకాయ్!" అంటూ, గురునాథంగారు కొంచెం సేపు ఆగారు. "పంచాయతీబోర్డు ఎలక్షన్లు దగ్గరపడుతున్నాయి. మరో వారంరోజుల్లో నామినేషన్లు దాఖలు చేయాలి. నేను యిదివరకే ఒకటి రెండుమాట్లు మెంబరుగా నిలబడమని నీతో చెప్పాను. ఇంతకూ ఆ విషయం ఏమి చేద్దామనుకున్నావు. ఇంతమందిమీ కలిసి యీ వార్డుకు పోటీచేయమని నిన్ను అడగటానికి వచ్చాము. మరి నీ అభిప్రాయమేమిటో చెప్పు" అన్నాడు.

కనకాయ్ యేమీ చెయ్యలేక చేతులు పిసుక్కున్నాడు. "నా తాహతెంత — నే నెంత దొరా! నాకీ పంచాయతీ మెంబరూ వద్దు—ఏమీ వద్దు. కలిగిందేదో కలో గంజో త్రాగి బతుకుతున్నవాణ్ణి. పెద్దలకే యివన్నీ తగుతాయి. నేను నిలబడను దొరా !" అన్నాడు.

"పిలిచి పిల్లనిస్తామంటే వద్దంటా వేమిట్రా కనకాయ్. అది సరే గాని, నీ మామ కూడా యింతవరకూ మెంబరే కదా. దీనివల్ల వాడికేమైనా పూచిక పుల్లంత నష్టం కలిగిందా ! పైగా వాడికి ఎంత పలుకుబడి వచ్చింది. గూడెం మొత్తానికి పెద్దయినాడు కదా! నా మాట విని నీవు కూడా ఈసారికి నిలువబడు. బాగు పడతావు" అన్నాడు నిత్యానందంగారు.

"నన్నింత పెద్దచేసి, పిల్లనిచ్చి పెళ్ళిచేసిన మామ కెదురుగా ఎట్లా నిలబడను దొరా ! నన్ను మన్నించండి. ఇంకేమయినా చేస్తాను. ఈ ఒక్కతూరికి నన్ను వదలిపెట్టండి" అని నసిగాడు కనకాయ్.

"ఆరే కనకాయ్ ! గెలవటం, ఓడిపోవటం దేవుడిమీద ఉందిరా. నీవు మాకు నచ్చావు కాబట్టి ఇంతగా చెప్పవలసివచ్చింది. నిన్ను ఇంత పెద్దవాణ్ణి చేసింది నీ మామేనని అంటున్నావు — కాదని ఎవరన్నారు? నీవు నిలబడినంతమాత్రంలో నీ మామకు వచ్చే నష్టమేముంది. నీకు పిల్లనిచ్చినంత మాత్రాన, వాడి కాళ్ళనీళ్ళు తాగుతావురా వెర్రివాడా! ఒకవేళ నీ వలన యీ పని కాకపోతే తేల్చిచెప్పు. మరొక మార్గం చూచుకొంటాము. నీవు కాకపోతే, మనుషులే లేరంటావా ? ఈ గూడెంలోనే నీకు బదులుగా యింకొకడు నిలబడతాడు. ఆలోచించుకో; ఇందువల్ల నీ మామ పరువు యేమీ పోదు. ఏమంటావ్" అన్నాడు పుల్లయ్యగారు.

కనకాయ్ ఒక్కక్షణం మాట్లాడలేదు. తరువాత మెల్లగా కోలుకొని "దొరా ! అదికాదు; మా మామ నింతవరకూ కాదని ఏ పనీ చేయలేదు.

—35వ పేజీ చూడండి

## మల్లె మొగ్గ

కోపల్లె శివరావు

మాట్లాడకే మల్లి !
మధుర లాలస వల్లి!

మాటాడితే నీవు
మనిషివైపోతావు!
కమనీయ రాగాల
కరిగేటి ఎడద

నిబిడ కలుషిత భావ
నిలయ మౌతాది!
మాటాడకే మల్లి!
మధుర మానస వల్లి!!

మాటాడనందుకే
మమత గోలిపేవు
మరులు గొల్పుట జేసి
మానవుల మించి-

దైవ సన్నిధి పొంచి-
ధ్యానించి-భజియించు
భాగ్యమ్ము లభియించె...నీ
జన్మ తరియించ!

మాటాడకే మల్లి!
మురిపాల వల్లి!!

మాటాడకుండగనె
మన్ననలు గొమ్మ!
కలకు రా గుండియవు
కాబోకు సుమ్మ!!

నడయాడుమా మల్లి!
నయగార మొలుక!
సార్వజనీన భావ
సంపదలు జిలుకు...నీ

పుప్పొడిలో రేణువో
పున్నె మిడుదాక!
మాట్లాడకే మల్లి!!
మధుర లాలస వల్లి!!

మాటాడకే మల్లి!
మధురమానస వల్లి!...

## గ్రహస్థితి

మేషంతో బుధుడు, కర్కాటకంలో అంగారక రాహువులు, మకరంలో శని, కేతువులు, కుంభంలో శుక్రుడు, మీనంలో గురువు, మీన, మేషాలలో సూర్యుడు, వృశ్చిక ధనుర్మకరాలలో చంద్రుడు.

### మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ఈవారం గ్రహబలం బాగుంది. మీ కార్యక్రమాలకు అనుకూలంగా మార్గం కనుపిస్తూ ఉంటుంది. పోటీదారులలో మీమీద మంచి భావం ఏర్పడుతుంది. కుటుంబంలో ఇంతకుముందు ఉన్నటువంటి అశాంతి, అనారోగ్య దోషాలు తగ్గిపోతవి. వ్యవహార రంగంలోను, వృత్తిలోను క్రమక్రమంగా ముందుకు పోగలుగుతారు. అయితే డబ్బుయొక్క అవసరం అధికం అవుతుంది. కొన్ని సమయాలలో అప్పు చేయవలసిన అవసరం కలుగవచ్చు. మీ బుద్ధిబలంతో పదిమందిని సంతృప్తిపరచ గలుగుతారు. వారాంతంలో అనారోగ్యం సూచిస్తుంది.

* * *




### దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

12-4-1963 శుక్రవారము మొదలు
18-4-1963 గురువారము వరకు

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

అంతరంగంలో ఆందోళన కలుగుతూ ఉంటుంది కాని, ప్రత్యక్షంగా అధికారం ఏమీ ఉండదు. అనుకున్న పని కొంచెం నిదానంగా జరుగుతూ ఉంటుంది. గౌరవం లభిస్తుంది. శక్తికి మించిన బాధ్యతలను వేసుకుంటారు. అయితే దైవికంగా తగు మనుష్యుల సహాయం లభిస్తుంది. కుటుంబంలో తలవని తలంపుగా ఖర్చులు పెరుగుతవి. సంసారముతో కూడిన కార్యక్రమాలు అధికం. స్నేహితులు మిమ్ములను పక్కగా ప్రోత్సహిస్తారు. మధ్యలో ఒకటి రెండు సందర్భాలలో తొందరపాటువల్ల కలహాలు వచ్చే అవకాశాలున్నవి. ఆదాయం బాగుంటుంది. 13, 13 లలో శుభవార్తలు,కారణంలేని ఆందోళన.

* * *

### మిథునం :

(మృగశిర 3, 4 పా., ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఆర్థికంగా కొంత అసంతృప్తి కనుపించవచ్చు. కాని మీరు ఏ పనిలో ప్రవేశించినా నిరాటంకంగా

---

**ఈ వారము ధరలు**

వేరుశనగనూనెధర మొదట్లో నిలకడగా ఉన్నా వారాంతంలో దిగివస్తుంది. బంగారంధరలో పెద్ద మార్పు ఉండదు. పసుపుధర కొద్ది తేజీ వస్తుంది. మినుములధర తగ్గే అవకాశాలున్నవి. మిర్చిధర మందీ అవుతుంది. ధనియాలకు కొద్ది గిరాకీ వస్తుంది. ప్రతి ధర మొదట తేజీ కనుపించి వారం రెండవభాగంలో తగ్గుతుంది.

---

రుపుకొని రాగలుగుతారు. స్నేహబృందం పెరుగుతుంది. సంఘంలో పలుకుబడి, స్వేచ్ఛ బాగుంటుంది. కోర్టు కచ్చేరీలతో అనుకూలమైన కాలం. ఎంత కఠిన సమస్య కూడా మీ బుద్ధిబలంతో సులభంగా విడిపోగల సమయం. వ్యాపార రంగంలో మీరు అనుకున్న ప్రకారం ముందుకు పోగలుగుతారు. భారీ కార్యక్రమాలలో ధనం వినియోగించే సందర్భాలలో సమయం, సందర్భం ఆలోచించటం అవసరం. 15, 16 లలో శుభ కార్యాలు, వృత్తిలో అభివృద్ధి, గౌరవము.

* * *

**కర్కాటకం :**

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

అవకాశ మున్నంతవరకు చల్లగా సాగిపోవటానికి ప్రయత్నించటం అవసరం. "అడిగేవానికి చెప్పేవారు లోకువ" అనే సామెత అనుభవానికి వస్తుంది. వృత్తి ఉద్యోగాలలో శ్రమ, పై అధికారులవల్ల విమర్శలు ఏర్పడగల సమయం. అయితే గౌరవహాని మాత్రం కలుగదు. ధన విషయంలో మంచివారి సహాయం లభిస్తుంది. శుభ, పుణ్య కార్యాలు ఆటంకంగా జరుగుతవి. విలువగల వస్తువులు కొనటంలో సదానము, జాగ్రత్త అవసరం. ప్రయాణాలు చేస్తారు. ప్రత్యేకం అనారోగ్యం చేయకపోయినా శారీరకంగా శ్రమ పెరుగుతుంది. ఉత్సాహపరిచే మనుష్యులు తటస్థపడుతూ ఉంటారు. 17, 18 లో ఆటంకాలు, పట్టుదలలు.

* * *

**సింహం :**

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

సాధారణంగా మీ సంకల్పానికి తిరుగు అనేది ఉండదు. సంఘంలో ప్రోత్సాహంతోపాటు ప్రతిబంధకాలున్నట్టు కనుపిస్తూ ఉంటవి. అయితే పర్యవసానంలో మీ మాట చెలామణి అవుతుంది. ధనాదాయం మీరు అనుకున్నంతగా పెరగక పోవచ్చు. తరచు గొప్పవారితో పరిచయం లభిస్తుంది. నూతన వ్యాపారాదులను గురించిన ఆలోచనలు, ప్రయత్నాలు సాగిస్తూ ఉంటారు. కుటుంబంలో అనారోగ్య సూచనలు కనుపించినా మిగతా విషయాలలో నెమ్మదిగా ఉంటుంది. దైవ కార్యాలలోను, వినోద కార్యములలోను పాల్గొంటారు. 17, 18 లలో అసౌఖ్యము, కారణం తెలియని అశాంతి.

* * *

**కన్య :**

**(ఉత్తర 2,3,4 పా. హస్త, చిత్త 1, 2 పా.)**

ప్రస్తుతం మీరు ఏపని ప్రారంభించినా చల్లగా సాగిపోతుంది. గురువు మీకు అనుకూలంగా ఉన్నాడు. అన్ని వ్యవహారాలలోను మీ ఆధిక్యతను నిలబెట్టుకొంటారు. బంధువులవల్ల కొంతవరకు ఆటంకి కలుగుతుంది. మీకు సంబంధంలేని పనులలో జోక్యం కలిగించుకొనవలసి వస్తుంది. ఆదాయం మామూలుగా ఉంటుంది. ఇంతకుముందున్న ఆందోళన తొలగిపోతుంది. స్థిరాస్తుల కొనటం, అమ్మటం వంటి వ్యవహారాలలో పనులు చురుకుగా సాగుతవి. కాని కొంతవరకు దండుగను భరించవలసి వస్తుంది. శత్రుబాధ తొలగుతుంది. 14, 15 లలో మిత్రుల వల్ల సహాయం, వృత్తిలో లాభవార్తలు.

* * *

**తుల :**

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

ప్రస్తుతం ఏది జరిగినా మీ మంచికే దారితీస్తుంది. ఎవరు ఏమి చెప్పినా విని వదిలివేయటం మంచిది. వృత్తిలో గౌరవము, ఆర్థికంగా ఫలితం బాగుంటవి. తలవని తలంపుగా సంఘంలో మీ స్థితి పెరుగుతుంది. స్వల్ప విషయాలలో మిమ్ములను మోసగించామని సంతృప్తి పడేవారు ఉంటారు. అయితే మీకు ఏవిధంగాను కష్టనష్టాలు ఉండవు. వాహనాలమీద ప్రయాణించటం, అగ్ని, ఆయుధాలు—వీటికి సంబంధించిన పనులలో జాగ్రత్తగా ఉండటం అవసరం. తాత్కాలికంగా కొన్ని విరోధ సూచనలు కనుపిస్తవి. అందువల్ల మీ శ్రమ తగ్గుతుంది. మీ వృత్తికి, మిగత కార్యక్రమాలకు చక్కని అవకాశం ఏర్పడుతుంది. నిబ్బరంతో ఉండండి. 13, 14 లలో వినోద కార్యక్రమాలు, ఆదాయ వృద్ధి ప్రయాణం.

* * *

**వృశ్చికం :**

**(విశాఖ 4—వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

ఈవారం గ్రహబలం బాగున్నది. మీ ఆలోచనలకు ఇతరుల సలహాలకు పొందిక ఏర్పడి త్వరలో ఒక రూపం ఏర్పడే అవకాశా లున్నవి. మనస్సులో ఆందోళన తొలగిపోయి ఒక నిర్ణయానికి రాగలుగుతారు. అధికారుల సహాయం లభిస్తుంది. వృత్తి ఉద్యోగాలలో సాటివారి ప్రోత్సాహం బాగుంటుంది. ఒకప్పుడు మీరు నిదానంగా ఉన్నా మిమ్ములను ప్రోత్సహించి కార్యం సాధించగలవారు లభిస్తారు. ప్రయాణ సూచన లున్నవి. ధనాదాయం బాగుంటుంది. విందులు, వినోదాలు మొదలయిన కార్య ఎక్కువ ధనం వినియోగించవలసి వస్తుంది. 15, 16 లలో కార్యసిద్ధి, ధనలాభం.

* * *

**ధనుస్సు :**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఒకప్రక్క చిక్కులు, శ్రమ ఉన్నా, స్వశక్తితో ముందుకు పోగలమనే ధైర్యంతోపాటు, అవకాశము లున్నా లభిస్తవి. మీ బుద్ధి చురుకుగా పనిచేయగల సమయం. ఏ సందర్భంలోను మాటలలో తొందరపడకుండా ఉండటం అవసరం. స్నేహితులు మీ మాటను బలపరుస్తారు. కుటుంబ వ్యవహారాలు ప్రశాంతంగా చూచుకో గలుగుతారు. ధన విషయంలో దుబారా తగ్గించి జాగ్రత్త పడవలసి ఉంటుంది. సాధ్యమైనంత వరకు మీవలన ఎదటివారికి శ్రమ కలుగకుండా చూచుకొనటం అవసరం. దైవానుగ్రహంవల్ల కలహ సూచనలు తొలగిపోతవి.

* * *

**మకరం :**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ప్రస్తుతంలో అధికంగా ఆశ పెట్టుకొనతగిన సమయం కాదు. శక్తిని అనుసరించి భారం వహించటం మంచిది. ఆదాయం మందకొడిగా ఉండటంవల్ల మనస్సులో ఆందోళన కలుగుతుంది. బంధువుల వద్ద నుంచి సంతోష వార్తలు వింటారు. వృత్తి వ్యాపారాలలో ఎదురుచూస్తున్న వార్తలు సకాలంలో అందవు. వారం రెండవ భాగంలో ఆదాయం పెరిగే అవకాశా లున్నవి. కుటుంబంలో ఇంతకుముందున్న సమస్యలు తీరిపోతవి. స్నేహితుల వల్ల సహాయం లభించే అవకాశాలు తక్కువ. మనో నిగ్రహం అవసరం. మీ ఆరోగ్య స్థితి ఇంత ఇంతకు ముందుకన్నా మేలు.

* * *

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

అదృష్టం బాగుంది. సుఖము, ధనము, పేరు ప్రతిష్ఠలు బాగా పెరుగుతవి. ఈ సమయంలో మీ విరోధులు మీకు చేసే అపకారం కూడా ఉపకారంగా ఫలిస్తుంది. వ్యవహార రంగంలో ఇతరుల కుయుక్తులు మిమ్ములను చికాకు పరుస్తవి. అందువల్ల కొంత నిదానం తప్పదు. అయినా భయపడవలసిన అవసరంలేదు. ఉత్తర దిక్కు నుంచి శుభవార్తలు వింటారు. నౌకరులతో కలహ ప్రసంగాలు వస్తవి. వారాంతంలో పిల్లల ఆరోగ్యం బాగుండదు. బంధువులవల్ల ఖర్చులు పెరుగుతవి. క్రమక్రమంగా వృత్తిలో మంచి మార్పు కనుపిస్తుంది.

* * *

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

సమయం మంచిది. ఆదాయంకన్నా గౌరవం పెరుగుతుంది. సాటివారిలో మంచి పేరు తెచ్చుకుంటారు. గత కాలంలో జరిగిన సంఘటనవల్ల మనస్సులో కలవరం కలుగుతుంది. కాని, ప్రస్తుతం ఏవిధంగాను చిక్కు ఉండదు. శుభకార్య ప్రయత్నాలు అనుకూలిస్తవి. ఋణబాధల నుంచి చాలా వరకు బయటపడ గలుగుతారు. గౌరవనీయులైన స్నేహితులు లభిస్తారు. కుటుంబంలో అనారోగ్యాలు తరచుగా వస్తూ ఉంటవి. ప్రయాణాలు నిలుపుకొనవలసి వస్తుంది. సాహసకార్యాలకు మనస్సు ఉత్సాహ పడుతుంది. కాని, దిగలేక పోతారు. 15, 16 లలో దైవ కార్యాలు, సంతోష వార్తలు. ★

# మీ చర్మానికి తగినది

# నివియా




# ఇదే మీ చర్మానికి కావలసినది

నివియా క్రీమ్‌లో "యుసిరైట్" — అద్వితీయమైన, సహజ ప్రకృతి పదార్థము వంటిది ఉన్నది. రోజూ స్నానం వల్లను, ఎండ, వాన, గాలిలో తిరుగుచుండుట వల్లను గోల్పోవునట్టి మీ చర్మమందలి చమురులను అది సమకూర్చుతుంది. నివియా మీ చర్మాన్ని, మృదువుగాను, యౌవనయుతమైన ఆరోగ్య వంతంగాను వుంచుతుంది. మీ చర్మానికి వాడదగినది. నివియా. ఇప్పుడే!

నివియా — వివిధోపయుక్తమైన క్రీమ్






Lintas C-248-TEL

ఇండియాలో సోల్ డిస్ట్రిబ్యూటర్లు: జె. ఎల్. మారిసన్, సన్ & జోన్స్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్, పోస్టుబాక్సు నెం. 1746, బొంబాయి-1

# మరణించినవాని వేలిముద్రలు

## మాజీ పోలీస్ కమిషనర్ - వాల్టర్ హెన్రీఛైల్డ్స్. (సిడ్నీ - ఆస్ట్రేలియా)

'సిడ్నీ'—ఒక చిన్న పల్లెటూరుగా ఉండే రోజుల్లో నేను 'లా ఎన్‌ఫోర్స్‌మెంట్' ఆఫీసరుగా ఆ వూరికి బదిలీ అయ్యాను. సిడ్నీ రానురాను ఎదిగి ఎదిగి రెండు మిలియన్ల జనాభా ఉండే అంత వూరయ్యింది. ఊరుతో పాటు నేరాలూ, అవి చేసే వారు, దోపిడీలూ, అవి చేసేవారు: హత్యలు అవి చేసేవారు కూడా ఎక్కువయ్యారు.

చిన్న ఉద్యోగం నుంచి కష్టపడి, పనిచేసి చివరికి 'న్యూసౌత్‌వేల్స్'కి పోలీసు కమీషనర్నయ్యాను. నా నలభై మూడేళ్ల సర్వీసులో—నే నెరగని నేరస్థుడు, దోపిడీదారు, తిరుగుబోతు, తాగుబోతు, హంతకుడు లేనేలేడు.

ఇరవై యో శతాబ్దం ప్రవేశించిన రోజుల్లో నేను "సిడ్నీ పోలీసు హెడ్‌క్వార్టర్స్ బ్యూరో" లో ఉండేవాణ్ణి. ఆ రోజుల్లో వేలిముద్రలవల్ల నేరస్థులను కనుక్కోడం పద్ధతి కొత్తగా వచ్చింది. మా డిపార్టుమెంటు యీ పద్ధతిలో నిరవధికమైన కృషి చేసింది. నాకీ పద్ధతిలో అమితమైన ఉత్సాహం కలిగింది. చేతిలో వుండే అనేక రేఖలూ, వాటి గతులను గురించి క్షుణ్ణంగా తెలుసుకున్నాను. న్యూసౌత్‌వేల్స్ జైళ్లల్లో ఉన్న మొత్తం ఎనిమిదివేల మంది నేరస్థుల వేలిముద్రలూ తీసుకున్నాము.

ఆ రోజుల్లో యీ శాఖలో పనిచేసేవారు సుమారు ఐదుగురుండేవారు. కానీ యిప్పుడు నేరస్థులు లెక్కకు మీరడంవల్ల 'ఆ శాఖా', దానితో పాటు అందులో పనిచేసేవారు కూడా ఎక్కువయ్యారు.

ఎన్. ఎస్. డబ్లియు (N.S.W.) వేలిముద్రల శాఖ సౌత్ పసిఫిక్‌లో కల్లా ప్రసిద్ధి పొంది ప్రపంచ శాఖల్లో కల్లా మంచి పేరు గణించుకుంది. ఈ వేలిముద్రల శాఖ సహాయంతోనే 'చర్మపు గ్లవుల' (Human gloves) హత్యా కాండని నేను కనుక్కున్నాను.

1933 వ సంవత్సరం—అవి క్రిస్టమస్ రోజులు. నేనా రోజుల్లో పోలీసు కమీషనర్‌గా ఉండేవాణ్ణి.

వేల్స్‌కి చాలా దూరంలో ఉన్న ముర్రమ్‌బిడ్జ్ నదిలో ఒకచోట ఒక శవాన్ని చూసినట్టు చేపలు పట్టేవాళ్లు యిద్దరు వచ్చి చెప్పారు. ఆ ప్రాంతం వ్యవసాయానికి బాగా పేరు పొందింది.

హత్య జరిగి చాలాకాలం అయివుండి ఉంటుంది. నదిమీదికి వంగిన ఒక చెట్టు కొమ్మలో శవం యిరుక్కుని, బాగా నాని, ఉబ్బి, పోలిక పట్టలేనట్టు భయంకరంగా ఉంది.

ఇట్టి పరిస్థితిలో 'వేలిముద్రల' పద్ధతిలో తప్ప హతుణ్ణి గురించి తెలుసుకోవడం అంత తేలిక కాదని నేననుకొన్నాను. కాని యిదీ అంత తేలిక కాదు. హతుడు లోగడ నేరస్థుడయి వుంటే కాని, అతని వేలిముద్రలు మా శాఖ ఫైళ్లలో ఉండవు.

పోలీసు శాఖవారు అక్కడికి బయలుదేరే ముందు నేను పోలీస్ ఛీఫ్ డిటెక్టివ్ ఆఫీసర్ 'ప్రయర్'ని పిలిచి, "పరీక్ష ఏవిధంగా మొదలైనా సరే, హతుని వేలిముద్రలు మాత్రం తప్పకుండా తీసుకోండి. హతుణ్ణి ఆనవాలు కట్టడానికి మనకి అవి చాలా ఉపయోగపడవచ్చు." అని చెప్పాను.

డిటెక్టివ్ యినస్పెక్టర్ మెక్రే, ప్రయర్, క్రాస్‌బీ, రావన్ మొదలైనవారు వేగంగా పోయే పోలీస్ జీప్‌లో ఎక్కి "వాగా" కి దూసుకు పోయారు. సిడ్నీ డిటెక్టివులు, వాగా పోలీసు బలగం—శవం కనబడిన చుట్టుపక్కల, నదిలోనూ నిశితంగా పరీక్షించారు. హత్య ఎక్కడ జరిగిందో నిర్ణయించడం చాలా కష్టం. నది ఎగువ భాగం నుంచి శవం కొట్టుకువచ్చి దిగువ భాగంలో చెట్టు కొమ్మలు అడ్డొచ్చినందువల్ల చిక్కుకుని ఆగిపోయి ఉండవచ్చు. శవాన్ని మరింత నిశితంగా చూసేసరికి శవానికి కుడిచెయ్యి లేనట్టు తేలింది.

ఆ చుట్టుపక్కల ప్రదేశాలు, నీళ్లలో ఉన్న దుబ్బుల చాటున వెతికే సరికి, నీళ్లల్లో ఒక పొదలో గోధుమరంగు సంచీ వంటిది ఒక డిటెక్టివ్ కంట పడింది. దానివల్ల హత్య కనుక్కోడానికి కొంతైనా ఉపయోగం ఉంటుందన్న ఆశతో అతను వంగి, దాన్ని పైకి తీశాడు. కానీ అది అతను వూహించినట్టు సంచి కాదు. చీకిపోయి ఉన్న మానవ శరీరంలో 'ఒక భాగం' లా అతనికి తోచింది.

దాన్ని అతను జాగ్రత్తగా హెడ్‌క్వార్టర్స్‌కి పంపించాడు. పోలీసు సర్జన్ దాన్ని పరీక్షించి, అది ఒక మనిషి కుడిచెయ్యి అనీ, క్రిములు తినివెయ్యడంవల్ల చెయ్యి ఆకారంలో లేదనీ తేల్చాడు. ఆ చెయ్యి ఆ శవందే అయ్యుండాలని నిర్ణయించాము.

శవం నది ఎగువ భాగం నుంచి కొట్టుకు వచ్చి దిగువ భాగంలో చెట్టు అడ్డు రావడంతోనే ఆగిపోయింది. శవం కుడిచెయ్యి చీకి, వూడిపోయి, క్రిములు తినెయ్యడంవల్ల అలా అయిపోయి, ఆ డిటెక్టివ్‌కి దొరికింది.

మేము కోరిందీ అదే అయ్యింది. ఆనాడు పోలీస్ లాబరేటరీలో జరిగిన సంఘటన నా కెన్నటికీ మరుపు రాదు. 1934 వ సంవత్సరంలో ప్రవేశించబోతున్న రోజులు అవి. పోలీసు సర్జన్ హతుని శరీరాన్ని లేబరేటరీ లో శుభ్రం చేశాడు.

డాక్టర్ హతుని చేతి చర్మం విడదీస్తుండగా చేతికి 'గ్లవ్స్' తొడుక్కుని ఒక పోలీసు డిటెక్టివ్ తన చేతిని ఆ చర్మంలోనికి నెమ్మదిగా పోనిచ్చాడు. అది నికరంగా అతని చేతికి సరిపోయింది. ఆనక అతను 'ఆ చేతిని' ఒక పాడ్‌మీద గట్టిగా నొక్కాడు. హతుని వేలిముద్రలు ఆ పాడ్ మీద స్పష్టంగా పడ్డాయి.

కానీ హతుణ్ణి నిర్ణయించడానికి యింకా చాలా తతంగం ఉంది. హతుని శరీరమంతా చీకిపోయి—మార్గ్ అనుపత్రిలోనే ఉంది. అతని ఎడమచేతి చర్మం వూడదీయటానికి నానాయాతనా అయ్యింది.

ఎడమచేతి చర్మం వూడదీయడానికి సర్జన్‌కు ముగ్గురు డిటెక్టివ్‌లు సహాయపడ్డారు. చివరికి 'ఆ కాండ' సవ్యంగా జరిగింది. ఆ ఎడమచేతి చర్మాన్ని మా పోలీసు హెడ్‌క్వార్టర్స్‌కి పంపించారు. మేము హతుని ఎడమచేతి ముద్రల కూడా 'అదే పద్ధతి' లో తీసుకున్నాము.

ఆనక అర మిలియన్ నేరస్థుల వేలిముద్రలతో యీ వేలి ముద్రలు పోల్చి చూడడం ప్రారంభించాము. ఇది నిజం చాలా కష్టమయినపనయినా మా కష్టం గమ్మున ఫలించింది. ఒక వేలిముద్ర యీ గ్లోవ్ ముద్రతో ఏకీభవించింది. దానివల్ల హతుని వివరాలు తెలిశాయి.

'అతను' నలభై, నలభై అయిదేళ్ల మధ్య వాడనీ, ఐదడుగుల ఏడంగుళాల ఎత్తుంటాడనీ, శుభ్రంగా క్షవరం చేసుకుని ఉండడంవల్ల పరిశుభ్రంగా ఉన్నాడనీ, కొంచెం బొద్దుగా ఉన్నాడనీ, నూట నలభైఏడు పవున్ల బరువనీ, కొన్ని పళ్లు వూడి ఉన్నాయనీ, ముదురు గోధుమరంగు, ఫ్లానెల్ షర్టూ, ముదురు నీలం ప్యాంటూ ధరించి ఉన్నాడనీ, కాళ్లకు మేజోడు లేదనీ—ఇనస్పెక్టర్ ప్రయర్--నిశితంగా వర్ణించి చెప్పాడు

అతని పేరు పెర్సి స్మిత్ అని తెలుసుకున్నాము. కానీ అతని పేరు ఎవ్వరికీ తెలియనివ్వకుండా, హంతకుణ్ణి పట్టుకోవాలనే ఉద్దేశ్యంతో—అతన్ని మేము ఆనవాలుకట్టినట్టు— 'పత్రికలకి' తెలియజెయ్యలేదు. నాలుగేళ్ల క్రితం తాగుబోతు, తిరుగుబోతూ—క్రింద అతను మా శాఖకి పరిచయమైనప్పుడు అతని వేలిముద్రలు తీసుకున్నాము.

మా అదృష్టంకొద్దీ పెర్సిస్మిత్‌ని చాలా తేలిగ్గా కనుక్కున్నాము. అతనికి ఒక రకం నల్లి

—33 వ పేజీ చూడండి

నా అనుభవంలో కెల్లా పెద్ద పరిశోధన-9



ఈ కొంటెచేష్టల కోమలి కృష్ణకుమారి: 1961 లో ఫిలిమ్ ఫాన్స్ సంఘంవారు ఈ అమ్మాయిని ఉత్తమనటిగా ఎన్నుకున్నారు.

(గత సంచిక తరువాయి)

## సందడైన యిల్లు

చాలా సందడిగా ఉంటుంది వాళ్ల యిల్లు. వాళ్ల అమ్మగారూ, అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్లూ అయినవాళ్లు, పిల్లలు అంతా హడావుడిగా ఉంటుంది.

ప్రత్యేకించి ఇంటిని అలంకరించిందికిగాని దాన్ని ముస్తాబు చేసిందికిగాని ఉన్న అవకాశాలు తక్కువ. అయితేనేం చాలా అందమయిన యిల్లు వేరేచోట కట్టించుకొంది కృష్ణకుమారి. ఆ ఇంట్లో పోయినేడాది నుంచి వేడుకగా గృహప్రవేశ మహోత్సవం జరిపింది కూడా. కాని ఆ యిల్లును అద్దెకు ఇచ్చింది. అందుకు కారణాలు ప్రస్తుతం ఉంటున్న యింటిమీద సెంటిమెంటు ఒకటీ—సొంత యింటికి మంచి అద్దె రావడం రెండు—ఈ రెండు గాక మరో కోరిక. ప్రశాంతంగా ఉండే చోట కాస్త చూట్టూరా ఆకాశమూ, ఆరు బయలూ అగుపించే చోట మరో చక్కని యిల్లు కట్టాలనుందిట ఆమెకు.

"ఈ యిల్లు అచ్చి వచ్చిందేమో .... కానా?" అన్నాను.

"ఆమాట నిజమే! చాలీచాలనిదీ అనుకుంటావే గాని, యీ యింట్లో ఉంటూండగానే అందమైన సొంతయిల్లు కట్టుకున్నాను నేను. పైగా మరో

# తెర మీద
# తెర వెనుక

**వీరాజీ**

ఇల్లు కట్టాలని కూడా ఉందేమో; ఆ కోర్కె యీవిధంగానే నెరవేర్తుందేమో'' నందామె.

## సింప్లిసిటీయే బ్యూటీ

కృష్ణకుమారి రకరకాల పాత్రధారణ, నిత్యమూ అనేక ప్రయాణలకూ లోనైన అలసటా ఉంటున్నా అప్పుడే కొత్త యవ్వనం పుంజుకున్నట్లు చలాకీగా నవ్వుతూ కలుపుగోరుతనంతో మాట్లాడుతుంది.

నిజంగా చాల సున్నితమైన మనసే. మాటంటే నొచ్చుకోకపోదు గాని, వెంటనే సరికి సరి అంటూ వచ్చినంత కోపం ప్రదర్శించడం ఈ అమ్మాయికి అలవాటులేదు.

''విమర్శల నెలా తీసుకుంటారు ?''

''శ్రద్ధగా తీసుకుంటాను. నేర్చుకుందికీ; పద్ధతులు మంచివైతే అనుసరించడానికీ; నేను వెనుదీయనం''దామె.

నిజ జీవితంలో ఎర్రని, సన్నని యీ తరుణాంగిని వేషధారణ ఎంత సింపుల్‌గా ఉంటుందో, భాష, భావ ప్రకటన కూడా అంత హాయిగా సూటిగా ఉన్నాయి.

పెద్దలంటే గౌరవం, పిన్నలంటే ఆపేక్ష, నేను వాళ్ల యింట్లో ఉన్న కొంచెంసేపులోనే గమనించాను.

''ఇల్లూ, డ్రాయింగు రూమూ అవీ అలంకరించాలనే ఉంటుంది గాని యీవేపు కాన్‌సెంట్రేషనుకి తీరిక తక్కువ. నన్ను వృద్ధిలోకి తేవాలని భావించి బుక్‌చేసే నిర్మాతలు నాకిచ్చే 'పాత్ర' అనూ—నా కెరీర్‌నూ, పిటినికదా ముఖ్యంగా చూడాలి'' అన్నదామె.

''అదే ముఖ్యం. ఇదో నిరంతర యాత్ర'' అన్నాను నేను.

''షాపింగ్ అంటే శ్రద్ధ ఉంది గాని— సాధారణంగా యివన్నీ అమ్మ బాధ్యతకి వదిలేస్తాను—'' నవ్వుతూ చెపుతుంది కృష్ణకుమారి. ''నాకు ఫలాని రంగులు కావాలి అని గాని, ఫలానిది యిష్టమని గాని యింట్లో ఎవ్వరికీ చెప్పక్కర్లేదు, వాళ్లకే తెల్సు'' నన్నది.

## సముద్రంమీద ఇష్టం

''షాపింగుకు వెళ్లను గాని, బీచ్‌కి గాని ఎక్కడేనా దూరంగా, ప్రశాంతంగా ఉండే స్పాట్‌కు గాని నో .... రెడీ .... ఏమాత్రం అవకాశం దొరికినా పారిపోతానం''ది కళ్లు పెద్దవిచేసి చంటిపిల్లలాంటి ఉత్సాహంతో—

''కొండలూ కోనలూ, పిట్టలూ, దూర తీరాలూ పిక్‌నిక్‌లూ యివంటే చాలా యిష్టం నాకు.''

ఈ అమ్మాయి మొహంమీద ''నా కిది అంటే పరమ అసహ్యం... నాకు యిలా ఉంటే కిట్టదూ..'' అని కుండ బద్దలు కొట్టినట్లు చెప్పదు. అలాగని గోరంతలు కొండంతలు చేసుకుని ప్రతీ విషయాన్ని మనసులో పెట్టుకుని మధనపడదు—స్టూడియోకు వేళకు వెళ్తుంది. పాత్రనూ, పరిస్థితులనూ క్షుణ్ణంగా తెలుసుకుని బాధ్యత నిర్వర్తించుకుంటుంది. పెద్దల సలహాలు పాటిస్తుంది.

''ఏదేనా పేచీలు, చిరాకులు కలిగితే, అలా నీలాకాశంకేసి, తుళ్లిపడే సముద్రంకేసి చూసి— ఆ విషయాలు అక్కడే మరిచి మనస్సును ప్రశాంతంగా ఉంచుకుంటుంది.

ఆరోగ్యంగా ఉండటానికి అందంగా ఉండటానికీ కూడా యీ అందాలతార అనుసరించే సూత్రాల్లో మొదటిది ''నొప్పింపక తానొవ్వక ఉండటం—నిర్మలంగా ప్రవర్తించడం, నిష్కల్మషంగా ఆలోచించడం''—

''అంతేనా ?'' అన్నాను నేను పై తత్వాన్ని మనసా అభినందిస్తూ.

''నా పనేదో నాది—ఇతరుల మార్గంలో జోక్యం చేసుకోను''—చెప్పిందామె.

''మిఠాయిలూ, గోధుమ రొట్టెలూ....'' అంటూ ఉండగానే పకపకా నవ్విందామె—''ఈ నవ్వు చూసే కాబోలు ఆదిన నవరత్నాలు రాల్తాయనుకున్నా రన్నా''మ నేను అసలు ప్రశ్న మార్చి.

''ఆహార పానీయాదుల విషయంలో మామూలు జాగర్తలన్నీ తీసుకుంటాను—కొంప తిన్ని లావెక్కానంటారా ? ఏం ?'' అనడిగింది.

''లేదు .... ఆ భయం కూడా యిప్పట్లో లేదు'' అన్నాను నేను నవ్వుతూ.

''నాకు నా ఫాన్ మెయిల్ ఒక కొలతబద్దలాంటిది. సాధారణంగా వాళ్ళేం రాసినా సరే శ్రద్ధగా చదువుతాను నేను. పొగిడినా, తిట్టినా సరే ప్రేక్షకులలో సిన్సియారిటీ చాలా ఎక్కువ.'' నమ్మకంగా చెప్పిందామె.

## కారన్నా షికారన్నా....

ఓ సినిమాలో వేషంలో ఉన్న కృష్ణకుమారి కార్ నడపాల్సి వచ్చింది. నిజంగా యీ అమ్మాయికి ఉడుకుమోత్తనం వచ్చేసింది. కార్ డ్రైవింగ్ రాక కాదు. దాన్ని అప్పుడే నేర్చుకుని మెల్లిగా నడపాల్సి వొచ్చినందుకు వొచ్చిందా వుడుకుమోత్తనం. షటిల్ కాక్, బాడ్‌మింటన్ లాంటి ఆటలకు అవకాశం దొరికితే నో చెయ్యి వేసి ఆడగల యీ అమ్మాయి మాంచి జోరుగా రెయ్యమంటూ కారు నడుపుకోడంలోనే ఎక్కువ 'థ్రిల్' పొందుతుంది''ట.

''రాష్ డ్రైవింగ్ యిష్టమన్నమాట!—స్పీడ్ లిమిట్ లుంటాయి జాగర్త'' అన్నాను. నవ్వుతూ నేను.

''సరిలెండి ! ఆ స్పీడ్ లిమిట్‌ల పూచీ మా అమ్మే పుచ్చేసుకుంది. అసలు స్లో డ్రైవింగ్ చేసినా తనకు నామీద నమ్మకం లేదు'' కృష్ణకుమారికి పెద్దల మాటంటే చాలాగౌరవం.

వాళ్ల ''మమ్మీ'' తో కలిసి గుళ్లోకి వెళ్లి దేవుడి మొక్కు తీర్చుకోడమూ అలవాటే.



కృష్ణకుమారి చమత్కారంగా
తియ్యగా మాటాడగలదు కూడా.

వదంతులను వినకండి
వదంతులను ప్రచారం చేయకండి




ఇంట్లో బట్టలను ఉతుకుటలో సర్ఫ్‌ను మించింది లేదు ! మీ బట్టలు సర్ఫ్‌యొక్క ఉతికే అధిక శక్తి వల్ల, ఎంతో సులభంగా, అమిత తెల్లగాను, పరిశుభ్రంగాను, వుంటాయి...షర్టులు, చీరలు, పిల్లల బట్టలు. అన్నిటికీ నేడే సర్ఫ్‌ను వాడి చూడండి.

# సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకును

SU. 25-X52 TL — హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

## రుచులూ, అభిరుచులూ

సింపుల్‌గా ఉండటమే ఇష్టమైన యీ సుకుమారికి నీలం రంగంటే ఇష్టం. "అదీ ఆకాశం మీదున్నప్పుడయితే మరీ ఇష్టం"—

# తెరమీద - తెరవెనుక

"బహుశా ఆకుపచ్చ చీరలన్నా, ఆ రంగులన్నా ఇష్టమై ఉండాలి" అన్నాను నేను.

"మరే! చాలా ఇష్టం" అంటుందామె.

ఈ ఏడాది 'కులగోత్రాలు' చిత్రంలో యామె నటనకు ఒక విశిష్టమైన స్థాయి ఏర్పడ్డమాట వాస్తవం. అలాగే గత రెండేళ్లల్లోనూ, యామె దైనందిన జీవితం కూడా నిలకడగానే ఉంటోంది. అయితే అన్ని కోర్కెలు, ఆశయాలు ఒకేసారి తీ



'ఇదిగో వచ్చేస్తుంటూ మేడదిగి అతిథులకోసం వస్తున్న సుందరాంగి 'కృష్ణ' - ఆ కళ్లల్లోని నైర్మల్యం గమనార్హం.



కొంటెతనం, బిడియతనం నలుగురి మధ్య పుట్టి పెరిగిన యీమెలో స్పష్టంగానే ఉన్నాయి.

"పెళ్ళా బాబూ ! పెళ్ళి అంటే నాకెంతో [illegible] అసహ్యం" అంటుంది.

## మంచి భవిష్యత్

'కభీ అంధేరా కభీ ఉజాలా'లో (హిందీ) నటించిన యీమెకు పది పదిహేను అరవ, కన్నడ చిత్రాలలో నటించిన క్రెడిట్ కూడా ఉంది.

పుస్తకాలు ముఖ్యంగా నాగకేసులు చదవడం, వీలైతే కులాసాగా బీచ్‌కో, పిక్నిక్కో లేదా 'స్కేటింగ్'' కో వెళ్ళడం సరదాగల యీమెకు యిప్పుడంత తీరిక లేనేలేదు—నాలు చిత్రాల్లో నటిస్తున్నదీ ఏడాది యీమె.

ఇంతవరకూ 50 పై చిలుకు తెలుగులో పదినాకా తమిళం, కన్నడం, చిత్రాలు నటించింది.

ప్రస్తుతం 'అనుబంధాలు' విష్ణుమాయ 'తరువ నమ్మ' "అన్నాధికారి" 'కానిస్టేబులు కూతురు' మొదలైన చిత్రాలలో నటిస్తున్న యీ అందాల తెలుగుతారకు ఉజ్వల భవిష్యత్తు ఉన్నది.

ఈ ఏడాది నిజంగా కృష్ణకుమారి సినీ జీవితంలో చాలా ప్రాముఖ్యం గలది. ఇదెంత "లక్కీ ఇయర్" అంత పరీక్షాసమయం కూడా.

బాధ్యత వెరైటీ గల కథానాయిక పాత్రలు యీమె జయప్రదంగా నిర్వహించి, అవార్డులూ, పతకాలు, పత్రాలూ వీటిని మించి ముఖ్యంగా ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొని నూరు చిత్రాలరేసులోకి పురోగమించాలని ఆకాంక్షిస్తున్నాను.

**ఈ సచిత్ర వ్యాసంలోని కుమారి కృష్ణకుమారి ఫోటోలు తీసినది శ్రీ ప్రభాకర్.**



'ఒప్పులకుప్ప ఒయ్యారిభామ' అందరి అభిమానం చూరగొంటున్న అభినేత్రి ఈ పద్మనేత్ర యీ ఏడాది 'బిజీస్టార్' అయింది.

తంతో నెరవేరవు. వీటికి కాలమూ, అదృష్టమూ కలిసి రావాలి. ఆ రెండూ యిప్పుడు 'తారస్థాయిలో' యీ అమ్మాయిని వరించాయి గనుకనే యీ వ్యాసం వ్రాస్తున్న సందర్భంలోనే యీమె నటించిన 'కులగోత్రాలు' యోగ్యతాపత్రం పొందినవైనంకూడా తెలిసింది.

### భయం!

కృష్ణకుమారికి ఫేన్‌మెయిల్ అంటే ఎంత ఇష్టమో రాజకీయాలన్నా 'బల్లి' అన్నా అంత భయం, అంత అయిష్టం.

రాజకీయాల గురించి యీమెకు ఎలాంటి అభిప్రాయాలూ లేవు.

"నెహ్రూ గొప్పవాడు, నా పెద్దవాడూ లాంటివా" అడిగాను. అనుకోకుండా నోరు జారిన ప్రశ్న అది. "అది నమ్మకం—అభిప్రాయం కాదు. నెహ్రూగారు మంచివాడూ, గొప్పవాడూ అని, నా పెద్దవాడు అని అందరికీ తెలుసు" అంటుందామె నవ్వుతూ.

# తెరమీద - తెరవెనుక

వచ్చేవారం తిరిగి తెరవెనుకకు పోబోతున్నాము!

- దర్శకుని బాధ్యత ఎలాంటిది?
- సినిమాలు అందరికీ నచ్చాలి అంటే ఎలా వుండాలి?
- అనుభవం గొప్పదా? ప్రతిభ గొప్పదా?

ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలతో సహా వరసగా సినిమాలు తీసిన వర్ధమాన దర్శకుని పరిచయం పైవారమే యీ శీర్షికలో చదవండి!

ఉండేది. ఆ పత్రివల్ల అతన్ని యిట్టే ఆనవాలు పట్టవచ్చు. స్మిత్ చిల్లర మల్లర ఉద్యోగాలుచేస్తూ— ఉద్యోగాలు దొరకని చాలా మందిలా వారానికో ఉద్యోగం చేస్తూ, నిరుద్యోగాన్ని భరించలేక— వాగొనెట్ (రెండు మూడు సీట్లుంటే ఒక రకం కారు వంటి వాహనం) లో తిరుగుతూ ఉండేవాడు. ఏ వూళ్ళో ఏ పని పోయాక—మరో పని కోసం యింకో వూరు పోతుండేవాడు.

చాలా ప్రయత్నంమీద—అక్టోబరు నుంచి డిశంబరు వది రోజుల వరకూ అతను తిరిగిన చోట్లు, చేసిన ఉద్యోగాలూ—వాటి వివరాలూ ఆరాలు తీశాము. స్మిత్‌నూ, మోరీ అనే అతని స్నేహితుణ్ణి డిశంబరు 18 న చూసినట్లు సాక్ష్యం లభించింది. ఆనాడు అతన్నీ, అతని వాగొనెట్‌నూ—మ్యూర్రమ్‌బిడ్జి నదికి ఎగువ భాగంలో చూసినట్లు ఆఖరికి తెలిసింది.

అదే రాత్రి మోరీ తన 'టెంట్' (గుడారం)కి వచ్చాక—అతని టెంట్‌మీద అక్కడక్కడ రక్తం మరకలు చూసినట్లు— ఊరగాలా తిరిగే కూలి జనం సాక్ష్యం చెప్పారు.

మోరీ అమ్మిన ఒక గుర్రం—కొన్ని చిల్లర సామానులు,స్మిత్‌కి చెందినవని దరిమిలాను తేలింది.

మోరీని పట్టుకోడానికి మేము ప్రయత్నించే సరికి—అంతకుమందే అతనో చిల్లర నేరంమీద అరెస్టయి—జైల్లో, రెండు వారాల అరెస్టులో ఉన్నట్లు తెలిసింది. అతన్ని వెతికే శ్రమ తప్పింది. వాగా ప్రాంతంలో నివసించే జేమ్స్ ఎన్నిస్ అనే ఒక గ్యారేజి సొంతదారు మోరీని 16 వ తారీఖున ఒకసారి, ఆనక నాలుగు రోజులు దాటాక మరోసారి చూశాననీ, రెండోసారి కలిసినప్పుడు ఒక 'వాగొనెట్' ని తీసుకువచ్చి తనచేత చిన్న రిపేర్లు చేయించుకుని కొంత డబ్బిచ్చాడని కూడా చెప్పాడు.

మోరీని అతని 'నివాసం' లో కలుసుకుని మేము ప్రశ్నించగా—ఆ వాగొనెట్' వాగాలో నివసించే

# మరణించినవాని వేలిముద్రలు

27 వ కేసు గురించి

సిడ్నీ అనే తన స్నేహితునివద్ద కొనుక్కున్నట్టు బుకాయించాడు. కానీ అతను చెప్పింది ప్రతిదీ మాకు లభించిన సాక్ష్యాలతో ఏకీభవించ లేదు. అతనిమీద స్మిత్ హత్యా నేరం మోపాము.

ఆరోజు 1934, మే 8 వ తారీఖు. ఆరోజే కేసు విచారణ ప్రారంభమయ్యింది. వాగా కోర్టంతా జనంతో కిటకిట లాడింది. కేసు యిదివరకు నుంచీ 'చదువుతున్న' ఆడవాళ్ళు ఆత్రంగా, తండోప తండాలుగా వచ్చారు. చిరునవ్వు ముఖంతో మోరీ కోర్టుకు హాజరయ్యాడు. ప్రతివాది వాదాన్ని ఎలుగెత్తి ఖండించి, పన్నెండుగురు జ్యూరీలమీద విరుచుకుపడ్డాడు.

జడ్జి యీ గోల భరించలేక, 'నిశ్శబ్దం' అని అరుస్తూనే ఉన్నాడు. ప్రతి సాక్షి వచ్చి మోరీ మీద కొన్ని 'విషయాలు' చెప్పడంతో మోరీ నోటికి మూత పడింది.

మోరీ తన 'టెంట్' ని (ఒక మనిషి నివసించడానికి వీలైన చిన్న గుడారం) వాగొనెట్ లోంచి దింపినప్పుడు దానిమీద రక్తం మరకలు చూసినట్టు ఒక—దేశాటన చేసే వ్యక్తి సాక్ష్యం యిచ్చాడు. ఆ వ్యక్తి ఆ విషయం చెప్పగానే మోరీ, "నోర్ముయ్! నీకెందుకు నా సంగతి" అని గట్టిగా అరిచాడు.

మోరీవద్ద నున్న ఒక కత్తికి రక్తం మరకల వంటి మరకలు చూశాననీ, ఆ కత్తి "వాగొనెట్' టాప్‌లో గుచ్చబడి ఉందనీ, గరేజి సొంతదారు జేమ్స్ ఎన్నిస్ సాక్ష్యం యిచ్చాడు.

మోరీ 'S' అనే గుర్తు గల ఒక రిస్టువాచీ, ఒక కోటూ, కొన్ని చిల్లర సామానులూ అమ్మాడని, అవి కొన్న వ్యక్తి వాటిని తీసుకొచ్చి చెప్పి, చూపాడు. అవి స్మిత్‌కి చెందినవేనని నిర్ధారణ అయ్యింది.

మోరీ, స్మిత్‌లు ఒకనాడు గట్టి వాగ్వాదనకి దిగారనీ, ఆ వాదనలో మోరీ అమిత కోపంతో స్మిత్‌ని చంపుతానని తిట్టాడనీ, ఆ సమయంలో తను ఆ ప్రాంతంలో ఉండడం సంభవించడంవల్ల తను విన్నానని జోన్స్ అనే వ్యక్తి పోలీసులకు లిఖిత పూర్వకంగా సాక్ష్యం యిచ్చాడు. కానీ అతనా నాడు కోర్టుకు రానందువల్ల కేసు మర్నాటికి వాయిదా పడింది.

మర్నాడు జడ్జి జోన్స్‌కోసం కేక వేయించాడు. కానీ జోన్స్ హాజరవ్వలేదు. ఒక పోలీసు ఉద్యోగి జడ్జి వద్దకు వెళ్ళి—సాక్షి (జోన్స్) తల వెనుక భాగంలో గుండు దెబ్బ తిని, చనిపోయి ఉన్నాడని చెప్పాడు.

జోన్స్ భార్యకి మోరీతో 'సంబంధం' ఉండడమువల్ల—జోన్స్ మోరీకి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పబోయే సమయంలో ఆమె అతన్ని కాల్చి చంపినట్లు తేలింది. ఆ నేరంతో ఆమెను అరెస్టు చేసినా, ఆనక—ఆ సంఘటన కేవలం అకస్మాత్తుగా జరిగిన ప్రమాదమనీ, బుద్ధిపూర్వకం కాదనీ ఆమెను వదిలివేశారు.

మోరీ కేసు విచారణ పూర్తయింది. హతుని చేతి చర్మాన్ని విడదీసి, దాన్ని 'గ్లోవ్' గా చేసి, వేలిముద్రలు సేకరించి దానివల్ల హతుణ్ణి పేర్సుగా కనుక్కున్న విధానం—ఒక వేలిముద్రల నిపుణుడు తెలియజేశాడు. మోరీ చివరి వరకూ నేరాన్ని ఒప్పుకోకపోయినా, అతనే హంతకుడని నిశ్చయము అయ్యింది.

మరణదండన విధించగానే—మోరీ గుమ్మున తన శ్వాసని కంఠానికి గట్టిగా బిగించేసుకున్నాడు. కానీ చావలేదు. ఆనక—శిక్ష తగ్గి—ఆ జన్మాంత శిక్షగా మారింది.

1953, డిశంబరు ఒకటవ తేదీనాడు— మోరీ క్షయవ్యాధితో బాధపడుతుండడంవల్ల—ఆనాటికి యిరవైయేళ్ళ శిక్ష అనుభవించి—విముక్తుడు అయ్యాడు. 




"అలాంటి పురుగునుంచి ఇంతమంచి చీర ఎలా వచ్చిందంటే, మిమ్మల్ని కాదండీ! పట్టుపురుగుని గురించి..."

# బ్రతుకలేనివాడు

23—పేజీ తరువాయి

"పెద్దలందరూ కలిసి యింతగా వచ్చి చెపుతూంటే కాదనటానికీ మనసు ఒప్పటంలేదు. ఏమి చేయ టానికీ పాలుపోకుండా ఉంది" అంటూ కొంచెం మెత్త బడ్డాడు కనకాయ్.

"ఇదుగోరా కనకాయ్ ! నీకేమీ భయంలేదు. నీవు ఊఁ ! అనూ. పై సంగతి మేము చూచు కొంటాము. నీవు గెలవటం మాత్రం ఖాయం. ఎవరైనా గొప్పవాడవుతుంటే, వాళ్ళ వాళ్ళందరికీ సంతోషంగా ఉంటుంది. నీవు గొప్పవాడవు కాబో తుంటే నీ మామ కాదంటాడా— నీ గుండెమీద చెయ్యివేసుకొని చెప్పు" అన్నాడు శర్మగారు.

"ఎబ్బే! అంత మాట నే ననలేను దొరా! నా బాగు కోసం నా మామ చాలా కష్టపడ్డాడు. సరే మీ అం దరి యిష్టప్రకారమే నిలబడుతాను. ఏం చేయ మంటారో చెప్పండి" అన్నాడు; ఏమీ మాటలు దొరకక కనకాయ్.

"కనకాయ్ ! ఇదే చెపుతున్నాను. మే మేదో అనుకొనిపోతామని మాత్రం ఒప్పుకొనబోకు. నీకు పూర్తిగా యిష్టమైతేనే నిలబడు. తీరా అంతా అయిన తరువాత ఫలానివారివల్ల నిలబడ వలసివచ్చిందనే నెపం మాత్రం మా మీద వెయ్య బోకు. మా గూడెంలో అందరికంటే తెలివైనవాడ వని ఇంతగా చెపుతున్నాము. ఈ సంగతి ఈ నాలుగు రోజులవరకూ ఎవ్వరితో అనవద్దు. నీవు గెలవటం మాత్రం ఖాయం. దానికయ్యే ఖర్చులన్నీ మేమే భరిస్తాము. ఈ విషయం ఎవరి దగ్గరా అనవని, మెంబరుగా నిలబడతానని ఈ దేవుడి ముందు అను కనకాయ్ ! ఎందుకంటే మేము మరి ఒకరితో ప్రయత్నం చెయ్యకుండా సరిపోతుంది" అన్నాడు శర్మగారు.

"దొరా! అన్నమాటను మార్చుకోవటం నాకు తెలియదు. అయినా మీరు అంతగా అడుగుతున్నారు కాబట్టి యీ దేవుడిమీద ఒట్టేసుకుని చెబు తున్నా! నేను నిలబడేది నిజం. ఎవరు అడ్డువచ్చినా ఆగను" అన్నాడు దృఢంగా కనకాయ్.

"కనకాయ్ నిలబడటం ఖాయమయింది మల్లయ్య గారూ ! ఇక మన పనిమీద మనం ఉందాం— కన కాయ్ ! రేపు మల్లయ్యగారి దగ్గరకు పోయి ఫారం మీద సంతకంచెయ్యి. ఈ సంగతి ఎక్కడా చెప్ప బొట్టకు సుమా! తెలిసే రోజుకు ఎట్లా అయినా తెలుస్తుంది — మేము వెళ్ళివస్తాము"– అంటూ లేచాడు శర్మగారు.

అందరినీ సాగనంపి యింటికి వచ్చాడు కన కాయ్. గౌరమ్మ "ఎవరా వచ్చింది" అన్నది మొగు డితో.

"ఊళ్ళో పెద్దల్లే. రేపు పది చెప్పుల జోళ్ళు కావాలంట" అంటూ మంచంమీద పడుకుని ముసుగుపెట్టి అంతవరకూ జరిగిన సంఘటనలను ఆకళింపు చేసుకుంటానికి ప్రయత్నం చేశాడు కనకాయ్.

"ఎంత పని ఉన్నా, పెద్దలు గూడెంలోకి రావటం ఏమిటీ ! అయినా ఒక్కసారే పది చెప్పుల జోళ్ళ అవసరం ఏమొచ్చిందబ్బా!" అనుకుంటూ గౌరమ్మ ఆశ్చర్యపోయింది.

నామినేషన్లు దాఖలుచేసిన మరునాడు గూడెంలో కనకాయ్ మెంబరుగా నిలబడినాడన్న వార్త వెంగు లోనికి వచ్చి చకచకా అన్ని మూలలకు పాకిపోయింది.

గౌరమ్మ గూడెంలో చెప్పుకుంటూన్న సంగతి మొగుణ్ణి అడిగింది. వాడుకాస్త మాట తప్పించ టానికి ప్రయత్నం చేసేవరకు పట్టుపట్టి అడి గింది.

"ఒసే గౌరీ ! ఆ రోజు పెద్దలంతా వచ్చి ఒకటే పట్టుబట్టారే. వాళ్ళనే నమ్ముకున్నోరం కదా— చివరికి చేసేదిలేక సరేనన్నాను. అన్ని ఖర్చులూ వారే భరిస్తారంట" అన్నాడు కనకాయ్.

గౌరమ్మ నెత్తినోరూ కొట్టుకొని యేడ్చింది. మామా అల్లుళ్ళ మధ్య యివేమి పోటీలంటూ కన కాయిని నిలబడ వద్దని బ్రతిమాలింది.

"చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే లాభం లేదే గౌరీ ! నావల్ల తప్పుజరిగి పోయింది. ఇప్పుడు నిలబడనంటే ఆ పెద్దమనుషుల్ని అవమానం చేసినట్లు—ఊళ్ళో గుప్పెడు మూకలు పుట్టవు."

"ఇంతకుముందా బుద్ధేమయిపోయింది రా మావా? అయినోళ్ళతో విరోధం తెచ్చుకుంటున్నావు. ఇక మీదు ఆ యింటిమీద కాకి యీ యింటిమీద వాలకుండా చేశావు" అంటూ గౌరమ్మ కొంగుతో కళ్ళద్దుకుంది.

తెల్లారి ఎండెక్కిన తరువాత షాపుకాడికి పోతూంటే కనకాయ్‌కి వాడి మామ ఎదురుపడ్డాడు: "ఒరే కనకం! మెంబరుగా నిలబడ్డావంటగ" అన్నాడు. "అవును మామా ! అందరూ ఒక్కటిరుగా బతిమ లాడుతూంటే కాదనలేకపోయినా ! నావల్ల తప్పు జరిగిపోయింది" నీళ్ళు నమిలాడు కనకాయ్.

"పెద్ద వాడివై పోయావు. నువ్వెందుకు తప్పు చేస్తావులేరా" అంటూ నోటిలో వెలిగే చుట్ట తీసి తుపుక్కున ఉమ్మేసి పక్కకు తొలిగిపోయాడు కనకాయ్ మామ తిరపతయ్య.

తీగల్లాగా అల్లిబిల్లిగా పెనవేసుకుంటూన్న గతంలోనుండి తేరుకునేసరికి పుల్లిగాడు దారిన బోతూ, కనకాయ్‌ని చూచి దగ్గరకు వచ్చాడు.

"ఏమిరోయ్ కనకం ! యిక్కడ కూచున్నావ్. గొప్పగొప్పోళ్ళంతా అక్కడ మైకుదగ్గర ఏం జరిగిందో నని కొట్టుకుచస్తున్నారు."

కనకాయ్ పుల్లిగాణ్ణి రమ్మని ప్రక్కన కూర్చో మన్నాడు. పుల్లిగాడు కూర్చున్నతరువాత "ఏమిరా బావా! ఏంటి సంగతులు. మా మామకు చాలా తప్పు చేసినాను. ఎరక్క దీన్లో కాలుపెట్టాను. గౌరి అప్పటినుండి ఏకధారగా ఒకటే ఏడుసనుకో. ఏమీ తోచక చస్తున్నాను" అన్నాడు.

"ఒరే కనకం ! నా దగ్గరనుండి నువ్వేదో లాగుదా మనుకున్నావుగాని, నీ సరస నా కేం నచ్చలేదురా. నువ్వు నిలబడ్డతరువాత మీ మామ తాను నిలబడ టం మానుకుందా మనుకున్నాడు. కానీ నీకు పట్టిన శని గ్రహాల్లాంటివే మీ మామకుపట్టాయి. అయినా నిన్ను యింతవాడిని చేసిన మామకే పోటీ తగలటం బావు శ్లేదురా" అన్నాడు పుల్లిగాడు.

ఇంతలో పంచాయతీ ఆఫీసుదగ్గర మైకుల గరగరలు వినిపించాయి. ఇద్దరూ చెవులు రిక్కించి దీక్షగా విన్నారు.

"రెండవ వార్డులో రిజర్వుడు సీటుకు జరిగిన ఎన్నిక ఫలితాలు: ఇందులో సామికర్ల కనకయ్య గెలుపొందాడు. అతనితో పోటీచేసిన తిరుపతయ్య

ఓడిపోయాడు. ఓట్ల వివరాలు: పోమికర్ల కనకయ్య 956, కొంపెల్ల తిరపతయ్య 893, చెల్లని ఓట్లు 14" అంటూ వినిపించింది.

వైకులో తన విజయవార్త వినేసరికి కనకాయ్‌కి వడి ఎండాకాలంలో మిట్టమధ్యాహ్నం తలపైన చన్నీళ్ళస్నానం చేసినంత పనయింది. తాను పంచాయతీ బోర్డు మెంబరయ్యాడు. గుండె పైకీ, క్రిందికీ కొట్టుకుంది. ఊపిరి సలుపుకునేటప్పటికి పుల్లి

## బ్రతుకలేనివాడు

గాడు "వస్తా; కనకం" అంటూ పైమీద తువ్వాలు ఒకసారి జాడించి చొక్కాలేని భుజంపై వేసుకొని వెళ్ళిపోయాడు.

దూరంగా కనకయ్యకూ "జై" అంటూ వినిపించింది. కనకాయ్ ఒళ్ళంతా పులకరించింది. పంచాయతీబోర్డు మెంబరు కనకయ్యకూ అని ఒకరంటే "జై" అని మరికొందరు అందుకుంటూ ఇటు వేపే వస్తున్నారు.

కనకాయ్‌కి కంపరం ఎత్తింది. జై కొట్టే వాళ్ళంతా తనకు దగ్గరగా వచ్చేస్తున్నారు. వాళ్ళకు ఎదురుగా పోదామనుకున్నాడు. ఒళ్ళంతా సిగ్గుతో ముడుచుపోయినట్లయింది. "అమ్మో! ఇంతేమైనా ఉందా! వాళ్ళ కంటపడితే అమాంతంగా చుట్టూ ముట్టేయురు! అంతమందిలో తనేం

మాట్లాడ లేస్తాడు."

మెల్లగా లేచి తలకాయ వెనక్కి త్రిప్పకుండా తడబడవడే కాళ్ళతో యించుమించు పరుగెత్తాడు. దూరంగాఉన్న సందుదారినపడి కొంపచేరుకొని మంచంపై కూలబడి ఊపిరి పీల్చుకుని "బతికి పోయా" ననుకున్నాడు కనకాయ్.

సుమారు మూడు గంటల ప్రాంతంలో కన కాయ్ యింటికి శర్మగారివద్దనుండి కబురువచ్చింది సాయంత్రం ఊరేగింపు ఉంది. వెంటనే బయలు దేరి రమ్మన్నారని" వచ్చినమనిషి చెప్పి వెళ్ళిపోయాడు.

కనకాయ్ చక్కగా స్నానంచేసి తనకు ఉన్న బట్టలలో మంచివాటి కోసం వెదకటం మొదలు పెట్టాడు. ఒకదానికి గూడపైన చినిగింది. మరో దాని "కాలర్" పిగిలిపోయింది. కొంచెం బాగున్న చొక్కా దండెంమీద ఆరవేసిఉంది. తాకి చూస్తే చల్లగా తడిగా తగిలింది. కనకాయ్‌కి చెడ్డ చిరాకు పుట్టుకొచ్చింది. ఈ కొంపలో అవసరానికి ఒక్కటే ఉండి చావదనుకుంటూ ఆ గూడపైన చిరిగిన దానినే తొడుక్కొని చినుగు కనిపించకుండా పైనో తువ్వాలు కప్పుకుని శర్మగారి వద్దకు బయలుదేరాడు.

దారిలో ప్రతివాడూ తనవంకే చూస్తున్న ట్లుంది కనకాయ్‌కి. ఏదో పట్టుకున్నట్లుయి పాదాలు ముందుకు సాగటంలేదు. తెలిసినవారు కనబడితే తలకాయ సరిగ్గా ఎత్తలేక పోతున్నాడు. దారిన పోయేవాణ్ణి పోనివ్వక తెలిసిన మొకాలు "ఏరో కన కాయ్ ! మెంబరయినవంటగా. ఇగ మేమేం కనబడ తంలే" అంటున్నారు.

కనకాయ్ గొంతుకేదో అడ్డం పడ్డట్లయింది. జవాబు కూడా చెప్పకుండా ఒక చిన్ననవ్వు పారేసి "వస్తా"నంటూ శర్మగారివద్దకు చేరుకున్నాడు. ఆ రోజు సాయంకాలము పూలపల్లకి కట్టిన ఎడ్ల బండిమీద ఊరేగింపు జరిగింది. పెద్దలతో పాటు తనుకూడా పల్లకి ఎక్కటానికి ముందు సంకోచించాడు కనకాయ్. కానీ, శర్మగారు హెచ్చరిం చిన మీదట బండిమీద కూర్చోనవున్న కుర్చీలో కూర్చున్నాడు. అంతమందిలో తాను కుర్చీమీద కూర్చోవాలంటే ఎంతో యిబ్బందిగా కనబడింది. ఇంతలో ఒక పిల్లవాడు బండి ఎక్కి అందరికీ పూల మాలలు వేశాడు. తానింతవరకూ ఎప్పుడూ పూల దండ మెళ్ళో వేసుకోలేదు. అదికాస్తా ఎంతో బరు వుగా గుండెపై వ్రేలాడుతూంది. "అబ్బ ! ఎంత బాగుంది. మంచివాసనకూడా వేస్తోంది." ఒళ్ళంతా చక్కలిగింతలు పెట్టినట్లుయింది కనకాయ్‌కి.

బ్యాండుమేళం ముందుకు సాగింది. గూడెంలోని చిన్నా పెద్దా రోడ్డుమీద నిలబడి ఆశ్చర్యంగా తనవైపే చూస్తుంటే కనకాయ్‌కి శరీరం పైకి తేలి పోతూన్నట్లుయింది. కిళ్ళీకొట్టు ముత్తన్న అందరికి సోడాలు కొట్టి కిళ్ళీలిచ్చాడు. గుంపులోని జనం పల్లకిలో ఊరేగే అందరికి జయజయ ధ్వానాలు చేస్తున్నారు. కనకాయికి మెల్లమెల్లగా తాను చాలా గొప్పవాడినయిపోయాననే భావం కలిగింది.

దారిలో గడ్డిమోపెత్తుకొని గౌరి, మా లక్ష్మితో నిలబడి వింతగా తనవేపే చూస్తుంటే కనకాయికి ఒళ్ళు గరిపొడిచింది. కుర్చీలో బాగా సర్దుకొని కూర్చున్నాడు. మెల్లగా పైమీది తువ్వాలు కొం చెం ముందుకు లాక్కొని గౌరవ్కని చూస్తూ చిరు నవ్వు నవ్వాడు. గౌరి కన్నార్పకుండా కనకాయిని చూచి, మా లక్ష్మితో "చూశావే మాలక్ష్మీ ! ఎంత్రటి దీపాల వెలుతుర్లో నా వాడెట్లా వెలిగిపోతుండో ! నల్లగుంటేనేం ? నా మావఁ గొప్పోడు" అంటూ పులకరించి పోయింది.

కనకాయి పైమీది తువ్వాలు రెండోమారు సర్దుకున్నాడు. ఈ తడవ తన గూడమీద ఉన్న చిరుగు జ్ఞాపకానికివచ్చి నిలువునా క్రుంగిపోయాడు. తువ్వాలను బాగా ముందుకు లాక్కుంటూ బిక్కు బిక్కుమని చుట్టూ చూశాడు— ఎవరైనా తన చొక్కా చిరుగును కనిపెట్టారేమోనని.

ఊరంతా ఊరేగిన తరువాత బోసు విగ్రహం దగ్గర పెద్ద బహిరంగ సభ జరిగింది. ఊరిలో పెద్దలంతా మాట్లాడినతరువాత కనకాయినికూడా "ఏమైనా మాట్లాడుతావా ?" అని అడిగారు. అంతమంది కూడిన సభలో మాట్లాడటమంటే మాటలా ! గుండె దడదడా కొట్టుకుంది. అతి కష్టం మీద "ఇప్పుడు మాట్లాడలేను" అన్నాడు. వాడి కడుపు చల్లగా "సరే" నంటూ అడిగినవాడు వెళ్ళిపోయాడు.

బహిరంగ సభ ముగిసిన తరువాత పెరిగిపోతున్న సంతోషంతో తన యింటికి బయలుదేరాడు కన కాయి. మెడలో వ్రేలాడే పూలమాలను తీసి ప్రక్క జేబులో పెట్టుకున్నాడు. తన గౌరి ఏం చేస్తూం టుంది అనుకుంటూ యింటివద్దకు వచ్చి "గౌరీ" అంటూ పెద్దగా పిలిచాడు. గౌరి తలుపుతీసి "అప్పుడే వచ్చినావు మావఁ ! ఊరేగింపయిందా ?" అంది; కళ్ళు యింతవేసి చేసుకొని తన మామని చూచుకుంటూ.

"ఆఁ ఎవడు ఊరేగుతాడు. మా గౌరిదగ్గరకు పోవాలయ్యా అని చెప్పి యిక్కడికి వచ్చినానే పిల్లా!" అంటూ జేబులోని పూలదండ తీసి గౌరిమెడలో వేశాడు కనకాయ్.

"ఊరేగుతూంటే ఎంత అందంగా ఉన్నావు మావఁ !" అంది గౌరి సంబరాలు పడిపోయి.

"పక్కన నువ్వుండాలి గాని — నే నెప్పుడూ అందంగనే ఉంటానే పిల్లా !" అంటూ గౌరి బుగ్గ మీద చిటికె వేశాడు కనకాయ్.

"పో మావా ! నీ పరాచకాలూ నువ్వూనూ !" అంటూ లోపలికి నడిచింది గౌరి.

తెల్లవారి లేచిన తరువాత కనకాయి అంతవరకూ ఈ ఎన్నికలలో తనకయిన ఖర్చు లెక్కవేసు కున్నాడు. ఎంతలేదన్నా తను సొంతంగా పెట్టిన ఖర్చు రెండువందలకు పైగానే దేకింది. శర్మగారూ, మిగిలిన పెద్దలు చాలావరకూ తనను గురించి డబ్బును పారపోశారు. వాళ్ళ ఋణం ఈ జన్మలో తీర్చుకో లేననుకున్నాడు కనకాయ్.

తాను మెంబరయినాడు కాబట్టి అన్నమావం పెద్దపెద్ద వాళ్ళతో కలిసి మెసలాలి. పొద్దున లేచిన దగ్గర్నుండి రాత్రి నిద్రపొయ్యేవరకూ క్షణంసేపు తీరికుండదు. ఈ చినిగిన ముతకగుడ్డలు వేసుకొని తిరుగుతూంటే ఏం బాగుంటుంది అనుకొని కనకాయ్ నూటయాభై రూపాయలు అప్పుచేసి గ్లాస్కో ధోవతులు, జరీఅంచుకండువాలు, పాప్లిను షర్టింగు తీసుకున్నాడు.

ప్రెసిడెంటు ఎన్నిక కూడా దగ్గరపడింది. ఒక నాడు రాత్రిపూట పదిగంటలవేళ అవతల పార్టీ శంభయ్యగారూ మరో పదిమంది పెద్దలూ కలిసి కనకాయింటికి వచ్చి తలుపు తట్టారు. కనకాయి తలుపుతీసి వచ్చిన వారి నందర్ని క్షణంసేపు చూచి నమస్కారాలు చేశాడు.

"నీతో కొంచెం పనిఉండి వచ్చాము కనకయ్యా! మాట్లాడటానికి నీకేమైనా అభ్యంతరం ఉందా ?" అన్నాడు శంభయ్యగారు.

"పెద్దలు — ఎంతమాట సెలవిచ్చారు. అర్ధ రాత్రిపూట యింతమంది కలిసి యిక్కడికి రాక పోతేనేం ? కబురంపితే నేనే మీ దగ్గరకు రాక పోయానా." అన్నాడు కనకాయ్.

"లోపలికిపద— నీతో అవసరంగా కొన్ని మాటలు మాట్లాడాలి" అన్నారు మరొకరు.

కనకాయ్ సిగ్గుపడ్డాడు. ఇంతమంది పెద్దలను తన యింట్లో ఎక్కడ కూర్చోపెట్టాలి. పెద్ద ఇరకాటంలో పడిపోయి "లోపల బాగుండలేదయ్యా ఏమైనా పనిఉంటే చెప్పండి. ఇక్కడే మాట్లాడు కుందాం" అన్నాడు.

"శంభరయ్యగారు విషయం పసిగట్టాడు. "మా కిప్పుడేం కుర్చీలూ గిర్చీలూ అక్కరలేదు.




"మంజుభాషిణి మీ ఆడువారితో వాదించుటకు ఒక్కనోరు చాలదు కదా!"

# బ్రతకలేనివాడు

నీవు గాబరా చెందవలసిన పనేంలేదు. ఏదో నాలుగు మాటలు మాట్లాడి పోదామని వచ్చాము. బయట కంటే, లోపలే బాగుంటుంది" అన్నాడు.

కనకాయి ఒక్కక్షణం వూరుకుని "సరే! రాండి" అంటూ లోపలికిపోయి ఒక చింకిచాప తెచ్చివేసి తాను నేలమీద కూర్చున్నాడు.

అంతమందిలోనూ కొంచెంసేపు నిశ్శబ్దం అవరించింది. చివరికి శంభయ్యగారే నిశ్శబ్దాన్ని భగ్నంచేస్తూ "కనకయ్యా! నిన్ను నేను చిన్నప్పటి నుండి ఎరుగుదును. అసలు నిన్నే మా పార్టీ తరఫున పోటీ చేయుమని అడుగుదామనుకునే లోపల ఆ శర్మ గారు కాస్త నీతో మాటతీసుకున్నారు. అయినా అయిపోయినదానికి యిప్పుడు విచారిస్తే లాభమేముంది. ప్రెసిడెంటు ఎన్నిక ఒకవారం రోజుల్లో ఉంది. నేను దానికి పోటీ చేస్తున్నాను. నీవు ఎట్లాగైనా, నీ వోటు నాకువేస్తే నీమేలు మరచిపోలేను. అసలు నాకు పోటీచేయాలని ఏమంత యిష్టం కూడా లేదనుకో— వీరంతా కలిసి ఒకటే పోరు పెడుతున్నారు కాబట్టి నిలబడక తప్పటంలేదు. ఏమంటావ్" అన్నాడు.

కనకాయ్ కొంచెంసేపు ఆలోచించి, "లాభం లేదండీ శంభయ్యగారూ! నన్ను యింతవారిని చేసిన శర్మగారిని వదిలిపెట్టి మీతో కలవలేను" అన్నాడు.

శంభయ్యగారివెంట వచ్చిన వాళ్ళంతా ఎంతగా బోధించినా లాభంలేకపోయింది.

చివరికి శంభయ్యగారు తెగించాడు! "కనకయ్యా: బాగా ఆలోచించుకో! నీవు బీదవాడివి. ఈ ఎలక్షన్ల వలన కొద్దో గొప్పో ఖర్చులయ్యే ఉంటుంది. నీవు మెంబరువి. ఊళ్ళో పెద్దమనుష్యులతో సమానమైనవాడివి. నీవు చెప్పులషాపు పెట్టటం బాగుండలేదు. నీచేత బియ్యం దుకాణం పెట్టిస్తాం. నీ ఒక్క వోటు నాకువస్తే నేను తప్పక గెలుస్తాను. నా తరువాత, నా అంతవాడినిగా నిన్ను చేస్తాను. వోటు నువ్వు ఎవరికి వేశావో ఎవరికీ తెలియదు. కావాలంటే నీకు ముందుగానే రెండువేల రూపాయలు యిస్తా. చేతిముందుకు వచ్చిన అవకాశాన్ని కాలితో తన్నుకోకు— బాగా ఆలోచించుకో— నీవు నీ జీవితంలో యింత డబ్బు ఒక్కసారి సంపాదించలేవు" అన్నాడు.

కనకాయ్ బాగా ఆలోచించాడు. తన్ను నమ్ముకున్న శర్మగారికి ద్రోహంచేయు బుద్ధి పుట్టలేదు. "నేను అంత పని చేయలేను దొరా! మన్నించండి" అంటూ చేతులు ముడుచుకున్నాడు.

"పోనీలే. యీరోజు కాకపోతే రేపైనా వచ్చి ఏ సంగతీ చెప్పు. కాని నీవు నాకు వోటుచేసినా చేయక పోయినా, యిట్లా మేము వచ్చామనిమాత్రం ఎవరికీ చెప్పనని మాటనీయాలి కనకయ్యా! కనీసం ఈసహాయమన్నాచేసి పెడ్తావనుకుంటున్నాను" అంటూ దీనంగా చూశాడు శంభయ్యగారు.

"నేను మీకు సహాయం చేయలేకపోయినా ఈ విషయం మాత్రం ఎవరితో చెప్పనని మాట యిస్తున్నాను దొరా! తిన్నయింటి వాసాలు లెక్కపెట్టలేను. క్షమించండి" అన్నాడు వాళ్లను వీడ్కొలుపుతూ కనకాయ్.

వచ్చినవాళ్ళందరినీ సాగనంపి తిరిగి—వచ్చిన కనకాయికి విసుగు పుట్టుకొచ్చింది. "ఛీ! ఎధవ

కొంపంటా ! ఏథవ కొంప. ఎవరైనా పెద్ద మనుషులు వస్తే కూర్చోమంటానికి ఒక బల్ల పీట కూడా లేకపోయె. రేపు ఎట్లా అయినా ఓ నాలుగు కుర్చీలూ అవీ కొని తేవాలి'' అనుకున్నాడు.

మరునాడు కనకాయ్ తన చెప్పులషాపు కాస్తా ఆరువందల రూపాయలకు అమ్మివేశాడు. మంచివి చూసి, నాలుగు టేకు కుర్చీలూ, రెండు బల్లలూ భార్యకు మూడు మంచి చీరలూ కొన్నాడు.

వాటి నన్నిటినీ చూచి గౌరి తెల్లబోయింది. "ఇవన్నీ ఎక్కడ తెచ్చావు మావా ! డబ్బెవరిచ్చారు'' అంది.

"తొందర్లో చిల్లర—కొట్టు పెట్టుతున్నావే గౌరి ! మారిగాడికి చెప్పులషాపు అమ్మేసినా'' అన్నాడు కనకాయ్.

గౌరమ్మ కండ్లవెంట బాష్పాలు జాలువారాయి. "మనం నాశనమయ్యే రోజులు వచ్చినాయి మావా! మా అయ్యతో సంబంధం చెడగొట్టుకున్నావు. అన్నంపెట్టే చెప్పులషాపు అమ్మేశావు. ఆ మిగిలి ఉన్న పొలం కాస్తా యియ్యాల్రేపో అయిపోతది. ఇక ఎట్లా మనం బ్రతకటం?'' అంది.

"ఛా ! నువ్వు నోరుముయ్యి, ఎప్పుడూ అపశకునం మాటలే'' అంటూ చీదరించుకున్నాడు కనకాయ్.

ఎలక్షనులో శర్మగారే ప్రెసిడెంటుగా ఎన్నికయ్యాడు. ఆయనగారితో పోటీ చేసిన శంభయ్యగారు ఒక వోటు తక్కువతో వోడిపోయాడు. తన వోటు వల్లనే శర్మగారు గెలిచారనే ధీమాతో ఛాతీ విరుచుకొని తిరిగాడు కనకాయ్. ఈలోగా కనకాయ్ కాస్తా కనకయ్యగా మారిపోయాడు. గిరజాల జుట్టు కత్తిరింపు వేయించి నాజూకుగా తయారయ్యాడు. చినిగిన బట్టలు తీసిపారేసి గ్లాస్కో ధోవతులతో, ఇస్త్రీ చేసిన బట్టలతో తళతళా మెరిసిపోయాడు.

క్రొత్త సభ్యుల ప్రథమ సమావేశం పంచాయితీబోర్డు ఆఫీసులో జరిగింది. కనకయ్య శర్మగారి ప్రక్కనే ఉన్న కుర్చీలో కూర్చున్నాడు. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు ఏవో కాగితాలు సర్దుకుంటూ శర్మగారితో మాట్లాడుతున్నాడు.

"ఆఫీసరుగారూ ! ఈరోజు ఎజెండా ఏమిటి' అంటూ ఒకరు ప్రశ్నించారు.

ఆఫీసరు మాట్లాడేలోపుగానే కనకయ్య అందుకుని, "ఏజెండా ఏమిటి ! మన జెండా ఉండగా ఇంకో జండా ఎందుకూ'' అంటూ గర్వంగా చుట్టూ కలియచూశాడు.

సభ్యులందరు కనకయ్యను వింతగా చూచి పకపకా నవ్వారు. వారందరూ తనను మెచ్చుకుంటున్నారనే భావంతో కనకయ్య "అంతేగదండీ ఎగ్జిక్యూటివు ఆఫీసరుగారూ ! ఈరోజునుంచి పెట్టాల్సింది మెజారిటీవాళ్ల జండే గదాండి'' అన్నాడు.

మళ్ళీ సభ్యులందరు నవ్వలేక పొట్టలు పట్టుకున్నారు. శర్మగారు మొఖం చిన్నబుచ్చుకుంటూ "కనకయ్యా! నీవు కొంచెం ఆగు'' అంటూ మందలించాడు.

శర్మగారు తనవేపు చురుకుగా ఎందుకు చూశారో **ఎంత ఆలోచించినా కనకయ్యకు బోధపడలేదు.**

"ఇంతకూ తను అన్నమాటలో తప్పేముంది'' అనుకున్నాడు.

సినిమాహాలు యజమాని లక్ష్మణరావుగారు ఆరోజు క్రొత్తసభ్యు లందరినీ "టీ'' పార్టీకి ఆహ్వానించాడు. అందరూ సాయంకాలానికి సినిమా హాలు చేరుకున్నారు.

"టీ'' పార్టీ అనంతరం లక్ష్మణరావుగారు అందరినీ సినిమా చూచి పొమ్మని బలవంతం చేశారు.

కనకయ్య సినిమాకు కుర్చీ టిక్కెట్టుకి ఎప్పుడూ పోలేదు. ఉమ్ములతో, సిగరెట్టు పీకలతో నిండి అసహ్యంగా ఉండే నేలకే ఎప్పుడూ పోయేవాడు. "కుర్చీలో కూర్చుని సినిమా చూస్తే ఎంత బాగుంటుంది'' అనుకున్నాడు కనకయ్య. పైనున్న పంకాలు గిరగిరా తిరుగుతున్నాయి. చల్లటి గాలి శరీరానికి తాకి కితకితలు పెడ్తోంది. అటువంటి సమయంలో మనసు ఉల్లాసంగా ఉరకలూగింది. ఏదైనా మాట్లాడా లనిపించి "ఇయ్యాళ ప్యాసింజర్లు బాగా వచ్చారే !'' అన్నాడు.

కనకయ్య అని మాటలు ఎవరికీ అర్థం కాలేదు. అర్థంకాని ముఖాలతో కొంతమంది కనకయ్యవేపు చూశారు. "ఇయ్యాళ సినిమాహాలుకి ప్యాసింజర్లు చాలామంది వచ్చారు'' అంటూ వారికి తా నన్నమాటను తిరిగి బోధపరిచాడు.

వాళ్లంతా ఒక్కసారి పకపకా నవ్వారు. ఇందులో నవ్వవలసినంత విశేష మేముందని కనకయ్య దిక్కు మొహం వేశాడు. సినిమా వదలిన తరువాత, శర్మగారి నడిగితే, "ప్యాసింజర్సు అంటే ప్రయాణం చేసేవార'' ని చెప్పి తానుకూడా నవ్వారు. కనకయ్య నాలుక కొరుక్కుని యికనుంచి పదిమందిలో తానేమీ మాట్లాడకూడదని ఒట్టేసుకున్నాడు.

శర్మగారూ, మిగిలిన పెద్దలు అనుకున్నట్లు కనకయ్య తను గూడేనికి పెద్ద కాలేకపోయాడు. ఇప్పటివరకూ తిరపతయ్యే పెద్దగా చెలామణి అవుతున్నాడు. మామా అల్లుళ్ళ మధ్య చూపులు మాటలు మరచిపోయాయి.

తాను మెంబరయిన రోజునుండి పనిఉన్నా లేకపోయినా ప్రొద్దుపోయేవరకూ శర్మగారి చుట్టూ తిరుగుతున్నాడు కనకయ్య. ఈ తిరగటంలో కనకయ్య కాస్తా కనకయ్యగారు అయిపోయాడు. పనుల అవసరం ఉన్న ఒకరిద్దరు వచ్చి ప్రాధేయపడితే, శర్మగారితో చెప్పి వారి పనులు చేసి పెట్టాడు. తరువాత ఒకరోజున అడ్డమైన వాళ్లందరినీ తనవద్దకు తీసుకురావద్దని శర్మగారు కనకయ్యను మందలించారు. ఆనాటినుండి మళ్లీ కనకయ్య అటువంటివాటి జోలికి పోలేదు.

గొప్పగా పదిమందిలో కనపడాలంటే విరివిగా ఖర్చుపెట్టాలంటారు. అందువలన కనకయ్య ప్రతిరోజూ ప్రొద్దుటిపూటా, సాయంకాలము తప్పనిసరిగా కాఫీహోటలుకు పోతున్నాడు. కనీసం డజను పంచెలన్నా వాడుతున్నాడు. రెండు రోజుల కొక యిస్త్రీ మడత విప్పుతున్నాడు. "రిమ్‌లెస్'' కళ్లజోడు పెట్టుకుని ఖరీదైన చెప్పులు వేసుకుని **క్రొత్త పెండ్లికొడుకులాగా బజార్లవెంట**

తిరుగుతున్నాడు. దీనితో ఖర్చులు విపరీతంగా పెరిగిపోయాయి. గౌరమ్మ గడ్డిమోపు అమ్మి తెచ్చే అర్ధరూపాయి డబ్బులతో పొయ్యిలో పిల్లి ఎలా లేస్తుంది. చెప్పులషాపుమీద సంపాదించిన రెండెక రాల పొల్లమూ చిల్లర ఖర్చులకోసం అమ్మేశాడు. తిన్నాంటే గుట్టలే ఆగవంటారు. పాపం! చిల్లర కొట్టు పెట్టటానికి తిరికే చిక్కలేదు కనకయ్య గారికి.

# బ్రతుకలేనివాడు

మొట్టమొదటి రోజుల్లో మెంబరుగా ఎన్నికయిన కనకయ్యను అంతా వింతగా చూసేవారు. కాలం గడచినకొద్దీ రోజూ కనపడేవాడేకదా అనుకొని అతనివైపు చూడటమే మానుకున్నారు.

రానురాను యిల్లు గడవటం కష్టమైపోయింది. తిరిగి పంచాయితీ ఎన్నికలు దగ్గర పడ్డాయి. శర్మగారు కనకయ్యను పిలిపించి "కనకయ్యా! ఈతడవ కూడా ఎన్నికలలో నిలబడుతావా?" అన్నాడు.

కనకయ్యకు కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. "వద్దు బాబూ! నేను ఈతడవ నిలబడదలచుకో లేదు. ఏదైనా పని చేసుకొని బతుకుదా మను కుంటున్నా" అన్నాడు.

శర్మగారు కూడా అంతగా పట్టుపట్టలేదు. దానికంత అవసరం కూడా లేకపోయింది. కనకయ్య మామ తిరుపతయ్యను తమ పార్టీ మనిషిగా నిల బెట్టి ఆ తడవకు గెలిపించుకున్నాడు. శర్మగారు మను ర్షులు. ఎవరిని ఎట్లా మంచి చేసుకోవాలో వారికి ఎన్నతో పెట్టిన విద్య.

కనకయ్య యింట్లో దరిద్రం తాండవించింది. చినిగిన చొక్కాలు కుట్టుకుని తొడుగుకుంటు న్నాడు. ఇల్లు వదిలి వీధిమొఖం పట్టాలంటే పచ్చిన చావైపోయింది. ఇంట్లో ఉంటే, ఖాళీ కుర్చీలు విరగబడి నవ్వుతున్నాయి.

పరిస్థితులు పూర్తిగా విషమించేసరికి గౌరమ్మ తండ్రి దగ్గరకు పోయి ఏడ్చి ఏభై రూపాయలు తెచ్చింది.

ఆ డబ్బుతో కనకయ్య పనికిరాని పాత స్టైరు కొన్నాడు. బోసు విగ్రహందగ్గర చెట్టు నీడ ఎండలో గోనె పట్టామీద కూర్చుని స్టైరు చెప్పులు కుడుతున్నాడు. ఒళ్ళంతా చెమటలు దిగ జారుతున్నాయి.

"కనకాయ్! యీ చెప్పులకి ఉంగటం వేయరా" అంటూ వినిపించింది. లాగి లెంపకాయ కొట్టిన ట్లయి తలకాయ పైకెత్తి చూచాడు కనకయ్— శంభయ్యగారు ఎడం—కాలి చెప్పు తీసి కనకాయ్ మీదికి విసరివేశాడు.

కనకాయ్ కండ్లముందు గతం గిర్రున తిరి గింది. ఏ బోసు విగ్రహం ముందు మీటింగులో పూలమాల వేసుకుని తాను కూర్చున్నాడో ఆ స్థలం లోనే యిప్పుడు జోడు అర్ధరూపాయి చేసే, స్టైరు చెప్పులు కుట్టుకుంటూ చెమటలు కారుస్తున్నాడు. ఎవరైతే ఒకప్పుడు తన దర్శనం కావాలని పాథేయపడ్డారో వారే యిప్పుడు చెప్పులు మీదికి విసిరేస్తున్నారు.

ఈ మధ్యకాలంలో కనకాయ్ కాస్తా కనకయ్య అయ్యాడు. తరువాత కనకయ్యగారు అయ్యాడు. చివరకు మళ్ళీ కనకాయ్‌గా మారిపోయ్యాడు.

"ఏమిరా కనకాయ్. ఇంకా కాలేదూ!" అంటూ చుట్ట పొగ గుప్పున వదిలారు శంభయ్యగారు.

గతంలోనుండి వర్తమానంలోనికి వచ్చాడు కనకాయ్. "అయింది దొరా!" అంటూ శంభయ్య గారి పాదాల దగ్గర మెల్లగా చెప్పుల—జోడు పెట్టాడు.

ఐదు పైసల భిక్ష కనకాయ్ మీదకు విసిరేసి "బ్రతకలేనివాడు" అంటూనే శంభయ్యగారు సాగి పోయారు.

సుళ్ళు తిరిగిన కన్నీటితో బియ్యంకొట్టు లిలగా మెరిసి కనకాయ్ చేతిలోని స్టైరు చెప్పుపై జారిపోయింది.



# తామర కొలను

21 వ పేజీ తరువాయి

"నిజం, రమేశుడి మాటలు అక్షరాలా నిజం. తనకు ఈమధ్య మాటలు చాలా ఎక్కువయ్యాయి. పల్లెటూరినుండి వచ్చిన పిల్ల తను. తనకు ఎక్కువ చదువు లేదు. మెడిసిన్ చదువుతున్న రమేశుడితో అంత ఎక్కువగా మాట్లాడటం తనదే తప్పు. ఈరోజునుండి ఎంతో అంటలో ఉండాలి" అని నిశ్చయించుకుంది శాంత.

కడిగిన పాత్రలు తీసుకుని లోపలికి వస్తున్న సుశీలమ్మగారు రాతిబొమ్మలా నిల్చున్న కోడల్ని చూసి:

"ఇంకా మడి—కట్టుకోలేదా శాంతా? కృష్ణుడికి ఆఫీసు టైమవుతోంది" అన్నారు.

శాంత తేరుకుని "ఇదుగో వెడుతున్నా" అంది.

"మొహం అలా ఉందేమిటి, వంట్లో బాగాలేదా?

"ఏం లేదే! బాగానే ఉన్నాను."

"రమేశ్ ఏమన్నా అన్నాడా ?"

చిన్న కొడుకు, పెద్ద కోడలి స్వభావాలు ఆమెకు తెలియనివి కావు.

రమేశుడి దుడుకుతనాన్ని ఖండించి, అతడి స్వభావాన్ని మార్చటానికెంతో ప్రయత్నించి చివరికి ఓటమిని అంగీకరించవలసివచ్చింది. శాంత సున్నిత హృదయమూ తెలుసు ఆమెకు. అత్తగారి ప్రశ్నకు "లేదు" అని మాత్రం బదులు చెప్పింది శాంత.

"వాడికి అంత చనువివ్వవద్దని నీ కెన్నోమార్లు చెప్పాను. నువ్వు వినవు. వాడికి పెద్దా, చిన్నా ఉండదు. ఇష్టమొచ్చినట్లల్లా వాగుతాడు. నువ్వేమో చిన్నబుచ్చుకుంటావు ....."

ఒక్కక్షణం క్రితమే రమేశుడి మొరటుతనానికి అతడిమీద కోపగించుకున్న శాంత రమేశుడిని వెనకేసుకొచ్చి:

"పాపం! వాడేం అనలేదు. కాలేజికి టైమయిపోయిందని సరిగ్గా టిఫిన్ కూడా తినకుండా వెళ్ళిపోయాడు" అంది.

"వాడు తినకపోతే నువ్వు వడలిపోతావా" అంటూ లోపలికి వెళ్ళిపోయారావె.

శాంత మడి—కట్టుకుని వంట ప్రయత్నంలో పడింది. చేతులు వంకాయల్ని తరుగుతున్నా, మనసులో రమేశుడి మాటల్నే నెమరువేసుకుంటోంది.

అత డన్నదీ నిజమే. స్వభావతః తను మితభాషి. స్నేహితులతో కలసి ఉన్నప్పుడు గాని, ఎక్కడైనా సరే, తను అంతగా మాట్లాడేది కాదు. తను ఎక్కువగా మాట్లాడేదల్లా రమేశుడితోనే. ఆకవీడట ఎంత అడిగితే అంతే సమాధానం చెప్పి ఊరుకో వాలి. తనంతట తానుగా పలకరించరాదు—

"శాంతా! పప్పు మాడిపోతున్నట్టుంది. వాసన వేస్తోంది; చూడు." అత్తగారి మాటలతో ఈ లోకంలోకి వచ్చిపడింది శాంత. తరిగిన కూర ముక్కలు పప్పులో పడవేసింది.

తన మనసు ఎంత దుర్బలమైంది! రమేశుడి ఓ చిన్న మాటకు తనింత బాధపడాలా ? అతడి చిన్నమాట తన మనశ్శాంతి నింత పాడు చెయ్యాలా ?

కృష్ణమూర్తి భోజనానికి వచ్చేసరికి వంట పూర్తయింది. పది గంటలకు సరిగ్గా రమేశుడికి క్యారియర్ తీసుకుని వెళ్ళే కుర్రాడు వచ్చి, సైకిల్ బెల్ మోగించాడు. శాంత క్యారియర్ తీసుకుని వెళ్ళి ఇచ్చివచ్చింది.

కృష్ణమూర్తి భోజనానికి కూర్చున్నాడు. శాంత వడ్డిస్తోంది.

"శాంతా! పులుసులో ఉప్పు వేయలేదు. మరిచిపోయావా ?" అని కృష్ణమూర్తి అడిగినప్పుడు ఆకు—కొనలో మారిన ఉప్పు వడ్డించింది.

"పాపం! రమేశ్ ఉప్పు లేకుండానే భోంచేయాలివాళ" అంది.

"నువ్వు ఊరగాయ పంపావుకదా ? అదొక్కటుంటే చాలు; వాడి కింకేమీ అక్కర్లా" అన్నాడు కృష్ణమూర్తి.

"మీకు నచ్చకపోయినంత మాత్రాన ఊరగాయ ఇంకెవరూ తినరనుకున్నారా ఏం ?" అంది శాంత.

"అన్నట్టు ఇవ్వాళ నువ్వూ, రమేశ్ దెబ్బలాడుకున్నారా ఏం ?"

"ఛా, అదేమిటి అలా అడుగుతున్నారు ?"

"అహో, పులుసులో ఉప్పు వెయ్యకపోతేనూ" అంటూ నవ్వాడు కృష్ణమూర్తి.

"మీ తమ్ముడితో దెబ్బలాడటం తప్ప నా కింకేం పని లేదనుకున్నారా ఏం ?"

"నిజమే,నీ కింకేం పనుందో చెప్పు చూద్దాం" కొంటెగా అడిగాడు కృష్ణమూర్తి.

"ఆ తమ్ముడి అన్నతో కాపురం చేయటం మాత్రం ఏమంత సులువైన పనా ఏం ?"

"అయ్యో పాపం !"

"ఆఫీసుకు టైమవుతోంది; తొందరగా లేవండి బాబూ."

కృష్ణమూర్తి ఆఫీసుకు వెళ్ళిపోయాక, గది శుభ్రం చెయ్యసాగింది. అతడు వెళ్ళిపోయాక, ఆ గదిలోని వస్తువులన్నీ చిందరవందరగా పడి ఉండేవి.

గదినిండా పుస్తకాలు, విడిచిన గుడ్డలు, కాలర్లు పడి పొర్లుతూ ఉండేవి. శాంత అన్నీ తీసి శుభ్రంగా సర్దిపెట్టింది.

మధ్యాహ్నం భోజనాలయ్యాక కాసేపు నిద్రపోవటం శాంత కలవాటు. చేతిలో ఓ పుస్తకం పట్టుకుని మంచంమీద పడుకోగానే ఆమెకు నిద్ర వచ్చేసేది. కాని ఈరోజు మాత్రం ఎంత ప్రయత్నించినా, నిద్ర రాలేదు.

"ఈ కుర్రకుంక మాటలను తలెందుకింత కేర్ చెయ్యాలి" అనుకుని నిద్రపోవటానికి ఎంతో ప్రయత్నించింది. కాని సాధ్యపడలేదు.

సాయంత్రం ఐదు గంటలు కావస్తోంది. గదినుండి బయటకు వచ్చిన శాంత మొహం జబ్బుపడిలేచిన దానిలా తయారయింది. మనసులోని అశాంతివల్ల తలనొప్పిగా కూడా ఉంది.

"ఇక రమేశుడు వచ్చే వేళయింది. కాఫీ రెడీగా లేకపోతే గొడవ చేస్తాడు" అనుకుంటూ, వంట గదిలోకి వెళ్ళింది.

"ఏమిటి శాంతా, ఇంతసేపు పడుకున్నావు? వంట్లో బాగాలేదా ?" అని అడిగారు సుశీలమ్మ గారు.

"కొంచెం తలనొప్పిగా ఉంది; అంతే."

"రమేశ్ వచ్చాక ఏదైనా మందు అడిగి వేసుకో."

"ఈమాత్రానికే రమేశ్ ఎందుకు ? ఓ మాత్ర ఏదన్నా మింగితే అదే పోతుంది."

బయట రమేశ్ వచ్చిన అలికిడి అయింది. సైకిల్ వరండాలో పెట్టి, బూటు—శబ్దం చేసు

## తామరకొలను

కుంటూ, గదిలోకి వెళ్ళాడు. చేతిలోని పుస్తకాలు గదిలో పడేసి, బట్టలు మార్చుకుని, సబ్బుపెట్టె తీసుకుని గబగబా నీళ్ల గదిలోకి వెళ్లిపోయాడు.

శాంత కాఫీ—గ్లాసు కడుగుతోంది.

"త్వరగా నాకు కాఫీ కలపండి వదినా. టేబుల్ టెన్నిస్‌కు టైమవుతోంది." రమేశ్ తొందర పెట్టాడు.

శాంత మాట్లాడకుండా వంటింట్లోకి వెళ్లిపోయింది. పీట వాల్చి కాఫీ, టిఫిన్ సిద్ధంగా ఉంచింది.

రమేశ్ డ్రస్‌చేసుకుని వచ్చి పీటమీద కూర్చోగానే, నెమ్మదిగా బయటికి జారుకుంది. కాని రమేశ్ ఊరుకుంటాడా ?

"వదినా .... వదినా .... "

"ఏం కావాలి ?" అంటూ లోపలకు వచ్చింది శాంత.

"ఇదిగో, ఈ లైట్‌బ్లూ షర్టు నాకు బావుంటుందా?"

శాంత రమేశ్ వైపు చూసింది.

అతడి కళ్ళు చిలిపిగా నవ్వుతున్నాయి.

"నీకేం, ఏదైనా బావుంటుంది."

"హాస్యానికి కాదొదినా, నిజం చెప్పండి."

"ఫస్టుగా ఉందిరా బాబూ."

"మీరు వాడే 'ఫేస్ పౌడరు' వాడా నీ రోజు."

" నువ్వు కొన్నావా ఏం ?"

"అబ్బే, నే నెందుకు కొంటాను. మీ టేబుల్ మీద కనబడింది. శుభ్రంగా రాసేసుకున్నాను. అలాగే మీ హేరాయిల్ కూడా .... "

"నువ్వొకడివి; అచ్చం ఆడదానిలా .... " అనేసి నాలిక కొరుక్కుంది శాంత.

రమేశుడితో ఎక్కువ మాట్లాడరాదనుకున్న మాట గుర్తుకు వచ్చింది.

"ఇహమీదట ఆ పౌడర్ నాకు దొరికేటట్టుగా పెట్టకండి. కనబడితే మాత్రం నే వొదల్ను."

"అది చాలా వెలరా బాబూ. ఇష్టం వచ్చినట్టుగా రాసేసుకోకు."

"అయితే అవుతుంది. మా అన్నయ్య డబ్బేగా పోయేది. మధ్య మీకేమిటి ?" అన్నాడు రమేశ్ శాంతంగా.

అంతలో సుశీలమ్మగారు లోపలికొచ్చి: "శాంతకు తలనొప్పిగా ఉందిట. ఏదైనా మందివ్వరా" అన్నారు.

"నా దగ్గర ఫీజు చాలా ఎక్కువవుతుందమ్మా. వేరే డాక్టర్ని చూడటం మంచిది."

"చాల్లేరా నీ పరిహాసం" అని విసుక్కున్నారు సుశీలమ్మగారు.

శాంతకు అసలు సంగతి తెలుసు. నవ్వుతూ:

"నీ ఫీజు ఎంత ?" అంది.

"ఒక్క సినిమా—బాల్కని టికట్" అన్నాడు రమేశ్.

"అలాగే" అంది శాంత.

"ఇప్పుడే ఇచ్చేయాలి. ఆట ముగించుకుని అలాగే సినిమాకు వెళ్లిపోతాను. భోజనానికి నాకోసం కాచుక్కూర్చోకండి."

"మందు చెప్పకుండానే ఫీజు పుచ్చుకునే డాక్టర్. భలే !" అంది శాంత కొంటెగా.

"ఒక్క సారిడాన్ మింగి నీళ్ళు తాగండి" అనేసి

గబగబా లేచి వెళ్ళాడు రమేశ్. తలుపుదాకా వెళ్ళిన వాడు గబుక్కున వెనక్కు మళ్ళి:

"వదినా! నా ఫీజు" అంటూ చెయ్యి చాపాడు.

శాంత యిచ్చిన రెండు—రూపాయల నోటు జేబులో వేసుకుని చకచకా వెళ్ళిపోయాడు.

రమేశ్ ఇంట్లో ఉన్నంతవరకూ అంతా మరచిపోయిన శాంతకు మళ్ళీ ఉదయపు సంఘటనే గుర్తుకు రాసాగింది.

"ఉదయం తనన్నమాట గుర్తు కూడా లేకుండా అతను హాయిగా తిరుగుతూంటే, తను మాత్రం ఎందుకిలా బాధపడాలి ?"

అలా అనుకుంటూనే రాత్రి వంట చేసింది. అందరి భోజనాలూ అయ్యాక రమేశుడి కంచం పెట్టి, వంటంతా అందేటట్లు పెట్టి:

"రమేశ్ వస్తే అతన్నే వడ్డించుకోమనండి. నాకింకా తలనొప్పి తగ్గలేదు" అని అత్తగారితో చెప్పి పడుకుంది.

కాని నిద్రమాత్రం ఆమె ఛాయలకన్నా రాలేదు.

రమేశ్ గేటు తెరుచుకుని రావటం కూడా ఆమెకు తెలుస్తూనే ఉంది. లోపలికి రాగానే:

"వదినా .... వదినా ...." అని పిలిచాడు.

"ష్ ..... అరవకు. శాంతకు తలనొప్పిగా ఉందని పడుకుంది. నువ్వు అన్నం తిందువుగాని పద" అన్నారు అక్కడే పడుకున్న సుశీలమ్మగారు.

రమేశ్ వెంటనే గొంతు తగ్గించి 'కులాసాగా ఉన్నారు కదా' అన్నాడు.

"ఉదయం నుండి అదో రకంగానే ఉంది."

"పులుసులో ఉప్పు వేయడం మరిచిపోయినప్పుడే అనుకున్నా; వదిన మామూలుగా లేరని."

రమేశ్ వంటింట్లోకి వెళ్ళేసరికే శాంత వడ్డించటానికి సిద్ధంగా ఉంది.

"మీ రెందుకు లేచారు? నేనే పెట్టుకుని తినేవాడినిగా."

"నెయ్యి కంచందగ్గర పెట్టటం మరిచిపోయాను. ఇక అలాగే అన్నం తినేస్తావని వచ్చాను."

"అన్నట్టు వదినా! ఉదయం పులుసులో ఉప్పు వేయలేదేం ?"

"ఏమిటో మతిమరుపు. నేనూ పెద్దదాన్నయిపోతున్నాను మరి."

"ఉదయం నుండి అదో మాదిరిగానే ఉన్నారట?

"లేదే" అని నవ్వటానికి ప్రయత్నించింది శాంత.

"సినిమా ఎలా ఉందని అడగనేలేదు ?"

"ఎలా ఉంది ?"

"చాలా బావుంది."

". . . . . . . . . ."

"ఎవరెవరు నటించారో అడగనేలేదు మళ్ళీ?"

"ఆడవాళ్ళు ఎక్కువగా మాట్లాడరాదురా, రమేశ్."

రమేశ్ తలెత్తి చూశాడు.

"ఆఁ, ఇప్పుడు అర్థమయింది అసలు విషయం. కాని, వదినా! నా స్వభావం తెలిసికూడా నేనన్న చిన్నమాట వంతగా పట్టించుకుంటారనుకోలేదు. నేను అలా అనిన వెంటనే ఒక్క లెంపకాయ ఇవ్వలేకపోయారూ ?

"నువ్వు ఇప్పుడు పెద్దవాడివయ్యావు. మొదటిలా చిన్న కుర్రాడివి కాదు కొట్టటానికి".

"అప్పుడూ మీరు కొట్టేవారు కారు. నన్ను కొట్టాల్సివచ్చినప్పుడు కూడా మీరు చిరుతిళ్ళు పెట్టేవారు. అందువల్లే నేనిలా తయారయ్యాను."

"ఎలా?"

"ఎలాగేమిటి, పూర్తిగా చెడిపోయాను."

"ఛ, అవేం మాటలు. నీకేం రాజులా ఉన్నావు."

"నేను రాజులా ఉండటానికి ఇంట్లో ఎంతమంది శ్రమిస్తున్నారో నాకు తెలుసదినా."

"నీకు కొంచెం అన్నం పెట్టేదా ?"

రమేశ్ ఒక్క నిమిషం మెదలకుండ ఉండి:

"మీ తలనొప్పి ఎలా ఉంది?" అన్నాడు.

"అలాగే ఉంది."

"సారిడాన్ తీసుకున్నారా ?"

"లేదు."

"పోనివ్వండి. ఇప్పుడు వెళ్ళి పడుకుని శుభ్రముగా నిద్రపొండి. తెల్లవారేసరికి తలనొప్పి పారిపోతుంది."

---

ఒకాయన పోలీస్ స్టేషనుకు హడావిడిగా పరిగెత్తాడు :

"అయ్యా! నా భార్య కనబడటం లేదండి."

"ఎన్నాళ్లనించి"-పోలీస్ ప్రశ్న.

వారం రోజులుగా."

"వారం రోజుల్నించి కనపడకపోతే ఇవ్వాళ చెప్తావేమయ్యా!" పోలీసు ఎదురు ప్రశ్న వేశాడు

"మా ఆవిడ తిట్లు ఇంకా నా చెవుల్లో రింగుమంటూనే ఉన్నాయండీ!" ఆ ఆసామి బిక్కముఖం వేశాడు."

పి. శారద (మద్రాసు)

---

"ఈ సలహాకన్నా ఫీజు ఇవ్వాలా ఏం ?"

"కాక! డాక్టర్లెప్పుడైనా ఫీజు తీసుకోకుండా సలహాలివ్వగలరా ?"

"అయితే ఇప్పుడేమివ్వాలి డాక్టర్‌గారూ ?"

"ఏమీ వద్దు; ఒక్కసారి నవ్వేసి వెళ్ళి పడుకోండి."

"అనవసరంగా నాకు నవ్వు రాదురా అబ్బాయి."

"అయితే నన్ను తల్లక్రిందులుగా నిల్చోమన్నారా ? అప్పుడైనా నవ్వగలరేమో మరి."

"పోరా, పిచ్చితండ్రీ" అంటూ శాంత నవ్వుతూ వెళ్ళిపోయింది. ఉదయంనుండీ బరువుగా ఉన్న మనసు ఇప్పుడు తేలిక పడినట్టు అనిపించింది.

కృష్ణమూర్తి ఎప్పుడో నిద్రపోయాడు. శాంత వెళ్ళి పడుకోగానే నిద్రాదేవి ఆమెను వెంటనే వరించింది.

మర్నాడు ఉదయం మామూలు ప్రకారమే రమేశుడిని లేపటానికి వెళ్ళింది శాంత.

"రమేశ్ .... ఆరు దాటింది .... ఇకనైనా లేవరా బాబూ!"

". . . . . . . ."

"టేబుల్‌మీద సరిగ్గా ఈ పుర్రె పెట్టావేంరా ? లేవగానే దాన్నే చూస్తావా పాడు. అవలక్షణం: దాన్ని ఎక్కడైనా కనపడకుండా దాచిపెట్టకూడదూ ?"

"ఏమన్నారు?" అంటూ, లేచి కూర్చున్నాడు రమేశ్.

"ఉదయం లేస్తూనే ఈ పుర్రె చూడటం మంచిది కాదంటున్నా."

"అలాగా! కాని, నేను లేవగానే దాన్ని చూడటం లేదే?"

"మరింకేం చూస్తున్నావ్ ?"

"మీ మొహం చూస్తాను. షేప్ చీదరుతో పాలిష్ చేసిన మొహం."

"నువ్వేం వర్ణించనక్కరలేదు గాని, దీన్నెక్కడైనా దాచేయి, నా కనిపించకుండా."

"ఆ పుర్రె వెనక ఎంత కథ ఉందో, మీకు తెలుసా ?"

"ఏమిటి ?"

"ఆ ముఖం కూడా ఒకప్పుడు మీలాంటి అందమైన ఆడదాని మొహం."

"చాల్లే ఇక; నాకు కోపం తెప్పించకు."

"నేను హాస్యానికి చెప్పటంలేదు వదినా! నిజంగానే; తనలోని రంగు, కాంతి, జీవం అన్నీ పోగొట్టుకుని, ఇలా తయారయింది. కలలో ఒక్కోసారి నిజరూపంలో దర్శన మిస్తుంది. ఆహా! ఎంతటి సౌందర్యం అనుకున్నారు! అలాటి లావణ్యరాశి దొరికితేనే పెళ్ళి చేసుకుంటాను. లేకపోతే బ్రహ్మచారిగానే ఉండిపోతాను."

"ఆహా! అందులోనూ తమరు బ్రహ్మచారిగా ఉండిపోవటం! అన్నట్టు తమ క్లాస్‌మేట్ మనోరమను ఏంచేస్తారండి డాక్టరుగారూ ?"

"మనోరమ విషయం మీ కెవరు చెప్పారూ? ఆమె నాతో టేబుల్ టెన్నిస్ ఆడటానికి వస్తుంది, అంతే; మరింకేం లేదు."

"ఇంకేంలేదూ ? నిజంగానేనా ?"

"నిజం వదినా."

"ఏమో బాబూ! నాకు మాత్రం నమ్మకం లేదు."

"ఓసారి ఇంటికి తీసుకొస్తాను. చూద్దురుగాని; ఆమె ఎవ్రిథింగ్, వదినా."

"అయితే మాత్రమేం? ప్రేమ గుడ్డిది."

"కాని ప్రేమికులకు కళ్ళుంటాయి. నా మటుకు నేను కళ్ళు మూసుకోను. నేను చేసుకోబోయే పిల్లకు వెన్నెల కాంతిని విరజిమ్మే ......"

"ఇహ చాల్లే. కాలేజికి టైమవుతోంది."

"మీ తలనొప్పి ఎలా ఉంది ?"

"నీ మాటలు వింటూ కూర్చుంటే, మళ్ళీ వస్తుంది" అంటూ లోపలకు వెళ్ళిపోయింది శాంత.

కోడల్ని చూడగానే సుశీలమ్మగారు "తలనొప్పి ఎలా ఉంది ?" అని అడిగారు.

"ఇప్పుడేం లేదు; తగ్గిపోయింది" అంది శాంత.

"మొహమంతా వడిపోయినట్టుంది."

"లేదే. బాగానే ఉన్నా" అంటూ వంటింట్లోకి వెళ్ళింది శాంత.

(ఇంకా ఉంది)






# జంతువులు ఆలోచించగలవా?

19-వ పేజీ తరువాయి

విరామం లేకుండా ఈ పని చేసేవి. పీటి సహాయంతో ప్రొఫెసర్‌గారికి ఒక కొత్తరకం ఉత్తి పండుకు డా దొరికింది. అలాగే అయిదు కొత్తరకం చెట్లు గూడా కనుక్కున్నాడు ఆయన.

రచయితం సంగతి చెప్పవే అక్కర్లేదు. ఎన్నో ప్రయోగాలు చేశారు. ఈ విషయంపైన! అంతే కాకుండా, విచిత్రమయిన సిద్ధాంతం ఒక కేంబ్రిడ్జి శాస్త్రజ్ఞుడు చేశాడు. సర్ రోనాల్డ్ ఫిషర్ ఇలా అన్నాడు: "త్వరలో శాస్త్రజ్ఞులు కుక్కలు, పిల్లులు, కోతులు—వాటి తెలివిని ఎక్కువ చెయ్యగలుగుతారు.

"మెదడుకి శస్త్ర చికిత్స చేసి, తర్ఫీదు చేసినట్లయితే ఈ జంతువులు చిన్న చిన్న వాక్యాలు పలికించగలవేమో! చింపాంజీలకి పనులు నేర్పి ఇంట్లో నౌకరుగా వాడుకోవచ్చు. కోతులకి కర్మాగారాలలో పనులు ఏర్పరుచవచ్చు." ఇది ఆయన మూడు సంవత్సరాల క్రితం అన్నమాట.

నమ్మేట్లు లేదా? కాని, ఈమధ్య జరిపిన పరిశోధనల ఫలితాలు ఇంకా అద్భుతంగా ఉన్నాయి. ...రు సంఖ్య వరకూ, వివిధ సంఖ్యలు కల చుక్కల ...ంపుల మధ్య భేదాల ఒక కాకి నేర్చుకుంది! ...ల్లలకి విచక్షణాజ్ఞానం చాలా ఉంది.

**కార్నెల్ యూనివర్సిటీలో పరిశోధనలవల్ల తేలిన ఒక వింత విశేషం. డెక్కలు గల జంతువు లన్నిటిలోనూ పందులు అతి శుభ్రంగా ఉంటాయి.**

ఒక గదిలో సామాను చిందర వందర చేస్తే వాటిని శుభ్రంగా అమర్చగలుగుతాయి. వరాహాలు.

కుందేళ్లకు ముద్దు పెట్టుకోవటం నేర్పవచ్చు. కోడిపిల్లలు 'బేస్‌బాల్' Baseball ఆడగలవు. మేకలు హై జంప్ (High Jump) చేస్తాయి.

ఆస్ట్రేలియాలో 'టోపే' అనే ఒక గుర్రం ఉంది. ఇది మాట్లాడగలదుట. ఎలిజబెత్ రాణీ, ఎడిన్‌బరో డ్యూక్ దీనిని సందర్శించి పరీక్ష పెట్టారు. 'ఎలిజబెత్' అనే పేరు తెలుసుకుని రాణివే సరిగ్గా తల ఆడించి పోల్చింది.

లేడీ పామెలా మౌంట్‌బాటెన్ దుస్తులమీద గుండీల సంఖ్య లెక్కపెట్టింది. కార్ల నెంబర్లు డెక్కలతో కొట్టి పోల్చింది.

కార్డిగాన్‌షయర్‌లో ఒక దూడ మూతితో దీపం స్విచ్ వేసింది. చీకటి పడేవరకూ స్విచ్ వేసేది కాదు.

ఇటీవల హాంప్‌షయర్‌లో ఒక కంచె తీగలలో కరెంటు వేశారు. కాని కరెంటు లేనప్పుడు ఈ తీగలు 'కటకట' శబ్దాలు చేసేవికావు. కొన్ని ఆవులు ఈ సంగతి కనిపెట్టి అవతల గడ్డి మేయటానికి తీగలను తుంచి పారవేసేవి!

ఇది విన్నారా, అయ నెహరికో ఒక కుక్క ఒ డే దిట ......

(వైవారం సంచిక చదవండి!)

# మనసు

12—వ పేజీ తరువాయి

చదవడంలేదు. నువ్వు శ్రద్ధగా చదవవలెను—లేవిచో—మామయ్య నీ పని పట్టగలరు. జాగ్రత్త.
—సత్య"

సత్యవతి గుర్తుకొచ్చినప్పుడల్లా, నవ్వురావడం రివాజైపోయింది శంకరానికి. ఆమె రాసిన 'లేఖ' చదువుకుని తనలో తనే నవ్వుకున్నాడు.

బట్టలు మార్చుకుని పుస్తకం తీసుకున్నాడు చదువుకుందికి.

— మాస్టారు మంచికి మరో పేరు. బడిపంతులు చేసి, తను సంపాయించకలిగింది ఈ పాత ఇల్లొ కటేను. ట్యూషన్లు చెప్పేవారు—దీనిమూలంగా వచ్చే ఆదాయాన్ని మాత్రం కాదనేవారు.

కాలం గడిచింది. ఇంటి విషయాలన్నీ గుప్పెట్లో దాచి ఉంచిన ఇల్లాలు కన్ను మూసింది. మాస్టారుకి యిప్పుడు మిగిలిఉన్న ఆనందం రాధ! ఆ పిల్లకోసమే మాస్టారు జీవిస్తున్నారు. లేక పోతే 'ఆవిడ' లేని ఈ వెలితి బ్రతుకు ఏవిధంగా ఎందుకు గడపాలో అర్థంకాక యమయాతన అనుభ వించేవారేను. ఇప్పటికీ అంటా రాయన—రాధే వా బ్రతుకూ, వెలుగూ—అని.

ఆయ నింట్లోనే 'అద్దె' కుండి, ఆయన దగ్గరే చదువుకుని హైస్కూలు దాటాడు శంకరం. శంకర మంటే మాస్టారికి అమితాభిమానం, వాత్సల్య మూను.

కాలేజీలో ప్రవేశించిన ఈ నాలుగేళ్ళ గూడా మాస్టారి నీడనే, ఆయన చూపించిన మార్గంలోనే నడిచాడు. ప్రయోజకు డయ్యాడని ఈనాడు చెప్పుకుంటే, అందుకు ముఖ్యమైన కారణం మాస్టారు.

ప్రతి నెలా తన కయ్యే ఖర్చు మాస్టారు తనిఖీ చేసేవారు. తనక్కావలసిన పైకాన్ని మాస్టారికే పంపేవారు నాన్న. నాన్న తన కే విషయాన్నయినా చెప్పాలనుకుంటే, అది ముందుగా మాస్టారికే చెప్పేవారు. తన శ్రేయస్సునంతా మాస్టారు చేతుల్లో పెట్టారు నాన్న.

మాస్టారికీ, తనకీ ఉన్న 'పరిచయాన్ని' కేవలం తన చదువూ, తన శ్రేయస్సులకే పరిమితం చెయ్యాలనిపించలేదు శంకరానికి. ఆయనతో బంధుత్వం ఆశించాడు. అది అమూల్య బాంధ వ్యంగా పరిణమించాలని శంకరం కోరిక.

రాధ తననుండి దూరం కాకూడదు. రాధతో తనకున్న పరిచయాన్ని, స్నేహాన్నీ, చనువునీ వృధా కానివ్వకూడదు. రాధ మనసు తనకి బాగా తెలుసు. మంచితనంలో ఆమె తండ్రిని మించింది. తను ఆశించిన గుణగణాలన్నీ రాధలో మూర్తీభవించి ఉన్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే—తన బ్రతుక్కి మరో అర్థం 'రాధ.'

వారంరోజుల క్రితం రాధపై తనకున్న అభిప్రాయాన్ని మాస్టారికి చెప్పాడు. అది విని ఆయన కలవరపాటు చెందారు. ఇది ఎలాంటి పరి స్థితులకు దారితీస్తుందో ఆయన ఊహించలేక పోతున్నారు.

బీదరికం అనుభవిస్తున్నా, అభిమానానికి ఆయ నెప్పుడూ దూరం కాలేదు. ఇన్నేళ్ళూ శంకరంపైన తను చూపించిన ఆదరణా, వాత్సల్యాల వెనుక ఇంత స్వార్థమా ? అని ఎవరైనా ముఖం ముందే అనేస్తే ? ఈ పేద బడిపంతులి అవిరామమైన కృషివల్ల తయారైన 'వల' పేరు శంకరం అనబడే ఒకానొక బంగారు పిచ్చుక! అని ఎవరైనా గేలిచేస్తే—విని సహిస్తూ బ్రతకడం దుర్లభం!

'రాధకీ నీకూ పెళ్ళేమిటి, నాయనా ? ఇది జరగ నిది!' అని చెప్పటానికి—ఆ యిద్దరిమధ్యా ఏర్ప డిన రాగబంధం తనని అంత మాట అననివ్వలేక పోతుంది.

ఇది మాస్టారి పాలిట ఒక పరీక్ష! ఒక సమస్య.

మరునటిరోజు ఉదయం.—

రాధ, శంకరం — గది గుమ్మానికి చేరగిలబడి, జడని సవరించుకుంటూ:

'నాన్న నాకంతా చెప్పారు' అన్నది.

"విన్న తమరు ఏమని సెలవిస్తారో తెలియ జేస్తే, భవదీయుడు సంతోషిస్తాడు."

"చెప్పనా ?"

"తప్పకుండాను."

"మన .... "

"ఊఁ .... మన .... "

"ఇంత త్వరలో పెళ్ళి జరగడం నాకూ, నాన్నకీ ఇష్టంలేదు." జడని వెనక్కి విసిరి గోడవైపు చూస్తూ అన్నది.

"ఎందుకనిట ?"

"మీ చదువుకి యింతటితోనే స్వస్తి పలకడం భావ్యంకాదు గనుక."

"అలాగా !"

"పెద్ద చదువులు చదివి, ఆఫీసరైతే—ఆపైన ఫలానతను నా శిష్యుడే సుమా అని గర్వంగా నాన్న చెప్పుకునే రోజు రావాలిట. ఆ రోజునే ఆయనకు సరైన గురుదక్షిణ లభించినట్లు భావిస్తారుట."

"సరే .... పెద్ద చదువులకే పోతా ననుకో. ఆ దరిమిలా చదువు పూర్తయ్యేంతవరకూ, ఈ రాధారాణిగారి ఎడబాటు సహించగలనా ? అన్నదే ప్రశ్న. మీ జవాబు ?"

"అదేం కుదరదు. చదువు పూర్తయిన తర్వాత పెళ్ళి. మీకు నేనూ, నాకు మీరూ కొనాళ్ళపాటు దూరంగా ఉన్నా, మధురంగానే ఉంటుంది కదా! అలాంటి మధురానుభవాలుంటేనే కదా జీవితానికి పరిపూర్ణత—అని నే నంటాను" అని కిలకిలా నవ్వింది రాధ.

వెన్నెల చిందినట్టు నవ్వగలదు రాధ. ఈ నవ్వూ, ఈ రాధే తనకు కావాలి. ఇవే లేకపోతే ?—

"శ్రద్ధగా చదువుకొంటున్నారా దొరగారూ ?"

"ఆహా .... రాణీగరికోసం ఏ ఘనకార్యమైనా చెయ్యగలను. చెప్పండి: కొండల్ని పిండి చెయ్య మంటారా ? ఏడు సముద్రాలూ దాటి .... "

"ఆపండి. అన్నేమీ చెయ్యక్కర్లేదు గాని, నాన గారి కోరిక తీర్చండి; చాలు."

"ఆజ్ఞ."

"మిమ్మల్ని ఆట్టే డిస్టర్బ్ చెయ్యడం తగదు. కాబోలు. చదువుకోండింక. వస్తాను."

"చంపావు రాధా! రోజూ ఈమాత్రమైన మాటాడకపోతే బోరుకొట్టి చస్తాను. పుణ్యమాయిరి మరోసారి ఇలా అనకు."

రాధ నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

తియ్యగా గడిచిన అలాటి రోజులు స్మృతి పథంలో ఎప్పటికీ చెరిగిపోవు!

—పరీక్షలొచ్చాయి—వెళ్ళాయి. శంకరం బాగా రాశాడు. క్లాసు రావచ్చుననే ధైర్యం కూడా ఉన్నది. ఇదే మాటని మాస్టారుతో చెప్పాడు. రెండు రోజులపాటు అక్కడే గడిపాడు. మూడోనాడు ఇంటికి వెళ్లడానికి పెట్టె — బేడా సర్దుతుండగా, రాధ తన గదిలోకి వచ్చింది. ఆ పిల్ల కళ్లల్లో చూచాయగా నీళ్ళు కనిపించాయి.

"అరె .... ఎందుకు రాధా కన్నీరు ?"

"ఛ .... బలేవారేనే ? నాకు కన్నీరేమిటి ?"

ఆమెవైపు తిన్నగా చూస్తూ అన్నాడు:

"మన పెళ్లిమీద మాస్టారికి నమ్మకంలేదు రాధా ! భగవత్సాక్షిగా చెప్తున్నాను. ఈ జన్మకు పెళ్లంటూ రాసిఉంటే, అది నీతోనే జరగాలి..... మా నాన్న విషయం మాస్టారికి తెలిసుండి కూడా ఎందుకో అనుమానిస్తున్నారు."

"దీంట్లో నాన్న తప్పేమీ లేదు."

"అంటే?"

"మనిషికి మనిషి అంత త్వరగా అర్థంకాలేడు శంకరం ! మనిషనేవాడు ఒక పెద్ద పార్యగ్రంథం. అర్థంచేసుకోడానికి వీలుకానంత క్లిష్టంగా ఉంటుంది."

"నిన్నందుకే అంటాను ఆ తండ్రికి తగిన కూతురవని. నువ్వు యిలాగే అంటున్నావు కాబట్టి ఓ పది రోజుల్లో మీ అందరి శంకలూ తీర్చటానికిగాను స్వయంగా మీ కాబోయే మావఁగారే ఇక్కడికొస్తారు. సరేనా ?"

".... .... ...."

"ఏమిటి ఆలోచిస్తున్నావు ?"

"ఉహూ .... ఏంలేదు .... మీకు వేళవుతుంది కాబోలు. ఉండండి; నాన్నను పిల్చుకొస్తాను."

రాధవెళ్లిపోయింది. కాసేపటికిమాస్టారువచ్చారు.

"క్షేమంగా వెళ్లిరా నాయనా !"

".... .... ...."

"తెలిసో తెలియకో నిన్నెప్పుడైనా కష్టపెడితే ఈ ముసలి మాస్టార్ని మన్నిస్తావుకదూ !" ఆయన గొంతు గద్గదికమయ్యింది.

"మాస్టారూ !"

"ఏమిటో శంకరం ! ఇన్నేళ్లూ మాలో ఒకడివిగా తిరిగావు. మా మనస్సుల్లో నిలిచిపోయావు. ఆ చనువుకొద్దీ నీ మనసుకి నచ్చని విధంగా నే నెప్పుడైనా ప్రవర్తించి ఉండవచ్చునుగా. కాని,ఒక్కటి మాత్రం నిజం.... నేను నీ శ్రేయోభిలాషిని."

".... .... ...."

"వెళ్లిరా నాయనా .... మాస్టార్ని మరిచిపోకు."

"మీరు చిత్రంగా మాటాడుతున్నా రీవేళ."

ఆయన పేలవంగా నవ్వేశారు.

"మాస్టారి గురించి నీ కింకా తెలియదు బాబూ. వేళవుతుంది .... వేగిరం .... బయలుదేరు మరి ."

—స్టేషనువైపు బండి కదిలింది. మాస్టారు వీధి చివరివరకూ వచ్చి, తిరిగి వెళ్లిపోయారు. చూపు ఆనినంతవరకూ, గుమ్మందగ్గరే నిలబడి చూచింది రాధ.

# మనసు

శంకరానికి తెలిసినవాళ్లెవరో నలుగురైదుగురు కనిపించి, పలుకరించి, అతని అడ్రస్సు వగైరాలు తీసుకుని వెళ్లిపోయారు.

కాస్త దూరంగా శంకరానికి సత్యవతి కనిపించింది.

సత్య మరో అమ్మాయితో నవ్వుతూ మాటాడేస్తోంది, మధ్య మధ్య ఎదుటామెని కుదిపేస్తో. ఈ చోద్యం చూస్తూ వాళ్లక్కాస్త అవతలగా నిలబడి ఆనందిస్తున్నారు కొంతమంది విద్యార్థులు. ఇదేమీ గమనించే స్థితిలో లేదు సత్య.

శంకరం ఆమెవైపు నడిచాడు. శంకరాన్ని చూచి పలుకరించింది సత్య.

"నువ్వొస్తున్నట్టు చెప్పలేదే సత్యా !" అన్నాడు శంకరం.

"మరే పాపం ! నువ్వు సర్వకాల సర్వావస్థలందూ రూంలో ఉంటావుగదూ. నాదే తప్పు. పద; మావఁయ్యతో అంతా చెప్పేస్తాను. రూంలో ఉండి, క్షణం కూడా చదవడంలేదని—పైపెచ్చు అబద్ధాలు విరివిగా ఆడేస్తున్నావని."

"ఉహూ .... అలాగేం ?"

"బైదిబై—ఈవిడ ఇందిర. మా క్లాసుమేటు. చాలా చక్కగా పాడుతుంది. ఆమాటకొస్తే వాళ్లింట్లో ఉన్న ప్రతి ఒక్కరూ గొప్ప గాయకశిఖామణులు. అప్పుడప్పుడు రేడియోలో పాల్గొంటారు గూడాను. ఇతను మా బావ. పేరు శంకరం. బియస్సీ ఫైనల్ రాశాడు. మా యిద్దరిదీ ఒకే ఊరు. చదువులో బ్రిలియంటని పెద్ద పేరు. ఇంతకంటే చెప్పుకోతగ్గ వివరాలు నాకు కనుపించడంలేదు."

సత్యవతి పరిచయంచేసే పద్ధతి చూచి ఫక్కున నవ్వింది ఇందిర.

"వసపిట్టకీ, సత్యవతికీ చాలా పోలికలున్నాయి. మహ అల్లరి చేస్తుందండీ" అన్నది ఇందిర.

"చదువులో చెప్పేరుకాదు" అడిగాడు శంకరం.

"ఆవిడనే అడగండి."

"పోవోస్. నాకు చదువెందు కసలు ? ఆడపిల్లకి చదువుతో పనిలేదన్నారు కొందరు."

"మరి చదవడం దేనికో."

"తోచక; చదివించే నాన్న ముద్దు చెల్లించడానికి. చాలా?"

"చాలు. నీతో మాటాడ్డమంటే బ్రహ్మవిద్య."

సరిగ్గా అదే సమయంలో దూరాన రైలుకూత వినిపించింది. ప్లాటుఫారంమీద కలకలం మిన్నుముట్టింది.

రైలు వచ్చి ఆగింది. శంకరం, సత్యవతి, ఇందిర దగ్గర సెలవు తీసుకుని రైలెక్కారు.

"అందర్నీ మరీ మరీ అడిగానని చెప్పు ఇందూ! వెళ్లగానే ఉత్తరం రాస్తానుగాని, జవాబులు రాయాలి సుమా ! ఏం .... అశ్రద్ధ జేస్తే మాత్రం నేను సహించేది లేదు. నా సంగతి తెలుసుగా. గుర్తుంచుకో..... "

రైలు కదిలింది. ఊరు విడిచింది!

—ఇంటికొచ్చిన మర్నాడు భోజనాలైన తర్వాత శంకరం నాన్నగారి గదిలోకి వెళ్లాడు. శంకరాన్ని చూచి, చదివే పుస్తకాన్ని మూసి—

"అలా కూర్చో" అన్నారు జానకిరామయ్య.

శంకరం కూర్చున్నాడు.

"మాస్టారు కులాసాయేనా ? ఈమధ్య ఆయన వంట్లో బావుండలేదని తెలిసింది. యిప్పు డెలా ఉందిట ?"

"కులాసాగానే ఉన్నారు."

"పరీక్షలెలా రాశావు ?"

"క్లాసు రావచ్చును."

"సత్య ఎలా రాసిందిట ?"

"నాకు చెప్పలేదు."

"ఉహూ.... నువ్విది పాసయిన తర్వాత ఎమ్మెస్సీ చదివించా లనుకుంటున్నాను."

"మీ యిష్టం."

ఎవరయ్యా? అది తారులో....?! రోడ్డు మధ్యగా తారు పడుండ దని తెలియదూ.....?!




ప్లాటుఫారంమీద ఎక్కువభాగం విద్యార్థులే కనుపిస్తున్నారు గుంపులు గుంపులుగా. వీడ్కోలు ఒకమూల, ఉత్తరాలు రాయడం మానరాదని ఆంక్షలు ఒకమూల, మరిచిపోనని హామీలు యింకొకవైపు. ప్లాటుఫారమంతా సందడిగా, అందంగా అగుపిస్తోంది.

# మీకు ప్రియతమమైన వాటి రక్షణకోసం
# ఇతోధికముగా పొదుపు చేయండి



## రకములో విశిష్టమైనది... ఖర్చు తక్కువతో తిరిగేది...

గణేష్ డిలైట్ ఫానులకు మంచి పనితనము, ఎట్టి ఒడుదుడుకు లేకుండా తక్కువ ఖర్చుతో ఏళ్ళ తరబడి పనిచేయుటము మొదలైన ఫానుకు ఉండవలసిన ముఖ్య లక్షణాలన్నీ ఉన్నాయి. కాని ఇంతకంటే కూడా గణేష్ డిలైట్ ఫాన్సులో నవ్యత ఒకటుంది. ప్రతి బ్లేడు కూడా అతి కచ్చితంగా శాస్త్ర సమ్మతమైన కోణంలో తగిలించబడింది-బ్లేడును తిప్పటం వంచటంగాని ఇతర పరిచేతలుగాని అవసరంలేదు. ప్రతి గణేష్ డిలైట్ ఫాను కూడా డిజైనులో అందంగా వుంది. నిశ్శబ్దంగా అత్యధికంగా గాలిని కలిగిస్తుంది.



## గణేష్ డిలైట్ ఫాన్స

గణేష్ ఫ్లోర్ మిల్స్ కంపెనీ లిమిటెడ్
94-85 నజఫ్‌గర్ రోడ్, న్యూఢిల్లీ-15

మద్రాసు డిపో:
ది. గణేశ్ ఫ్లోర్ మిల్సు కంపెనీ లిమిటెడ్,
నెం. 2, తంబుచెట్టి వీధి
మద్రాసు (ఫోను: 21680)

సూర్యుడు * ఫ్రూటోల్ దేవత

ఎండకు భయపడకు పాపా! ఇదిగో ఫ్రూటోల్ త్రాగు!...

## మీ పిల్లలను వేసవి ఎండలనుంచి కాపాడగలది ఒక్క స్వాన్ బ్రాండ్ ఫ్రూటాల్ మాత్రమే!

ఇండియా క్యానింగ్ ఇండస్ట్రీస్,
విజయవాడ-3.

AGENTS FOR ANDHRA
ఆక్మిట్రేడ్ ఏజెన్సీస్, విజయవాడ-1.

# మనసు

"వేరే ఏదైనా కోర్సుకి వెళ్లాలని ఉంటే చెప్పు. ఆ ఏర్పాట్లు చేస్తాను .... నీ పెళ్ళి చేసేయాలని మీ అమ్మ తొందర పెడుతోంది. అంగీకారమైతే—" ఆయన చిన్నగా నవ్వుతూ అన్నారు.

"నేను మాస్టారికి మాట యిచ్చాను."

"ఏమని ?" ఆయన ఆశ్చర్యపోతూ అడిగారు.

"నా చదువు పూర్తయ్యేంత వరకూ పెళ్లి చేసుకోనని."

"అలాగే కానివ్వు."

"పెళ్లి చేసుకోడమంటూ జరిగితే, మాస్టారిగా రమ్మాయినే చేసుకుంటానని కూడా చెప్పాను."

జానకిరామయ్యగారు ఉలిక్కిపడ్డారు. కొడుకవైపు తీక్షణంగా చూశారు.

"అంటే .... "

"రాధని ప్రేమించాను."

రెండు క్షణాల వరకూ తండ్రి మాటాడలేకపోయారు. తర్వాత అన్నారు:

"మరిన్నాళ్లనుండి నాకు చెప్పనేలేదేం ?"

"ఇప్పుడు ఆ అవసరం కలిగింది."

"ఏమిటా తిక్క సమాధానం ?"

".... .... ...."

"అన్నీ ఆలోచించే మాట యిచ్చావా ?"

"వీలైనంత త్వరలో మిమ్మల్నికూడా ఈ పెళ్లికి వప్పిస్తానని చెప్పి వచ్చాను."

"పెద్దవాళ్లమంటూ మేముండగా మాతో సంప్రదించకుండానే మాటివ్వడం జరిగిందా శంకరం ! మాకు నువ్విచ్చే గౌరవం యిదేనా ?"

"క్షమించండి. మీరు నా కోరిక నెప్పుడూ కాదనరని నాకు తెలుసు."

".... .... ...."

"చెప్పండి నాన్నా ! నా నిర్ణయం మీకు నచ్చలేదా ?"

"కాదంటే నువ్వు బాధపడటం తప్ప మరేమీ ఉండదుగా శంకరం! మాకు కావలసింది నీ సుఖం.'

"మీరు మాస్టారితో ఒకసారి మాట్లాడి రండి.

జానకిరామయ్యగారు కాసేపటి వరకూ మాటాడలేదు. చివరికి అన్నారు.

"నన్నూ ఆలోచించుకోనివ్వు శంకరం."

"సరే .... మీ యిష్టం." —

ఈ సంభాషణ అంతటితో ఆగిపోయింది. మళ్ళా మూడు రోజుల వరకూ తండ్రీ కొడుకుల మధ్య మాటలు లేవు. ఏమి ఆలోచించారని కొడుకూ అడగలేదు; నా నిర్ణయం యిదీ అని తండ్రీ చెప్పలేదు. నాలుగోనాటి సాయంత్రం తనని పిలిచి చెప్పాడాయన—

"నువ్వు ఈ విషయం గురించి ఆలోచించకు శంకరం. ముందు, ఆలోచించవలసినది నీ చదువు; అందుకావలసిన ప్రయత్నాలు—చెయ్యి. తతిమా విషయాలు నే చూసుకుంటాను. మాస్టారితో నేనే మాట్లాడి వస్తాను. సరేనా ?"

శంకరం కళ్లల్లో ఆనందం తొణికిసలాడింది. కృతజ్ఞతా పూర్వకంగా ఆయనవైపు చూశాడు.

మరో వారంరోజుల్లో రిజల్ట్సు వస్తాయనగా జానకిరామయ్యగారు మాస్టారింటికి వెళ్లి వచ్చారు. కొడుకుతోబాటు కాలువ ఒడ్డుకు వెళ్లారు.

"మాస్టారితో అన్ని విషయాలూ మాట్లాడాను"

"ఆయనేమన్నారు ?"

"ముందు నీ చదువు పూర్తి కావాలని ఆయనంటున్నారు." ఆ తర్వాత తమకుటుంబ విషయాలేవో మాటాడారు."

—శంకరం ఫస్టు — క్లాసులో పాసయ్యాడు. ఆ మర్నాడే విశాఖపట్నం వెళ్లిపోయాడు. అక్కడ బంధువులింట్లో ఉండి సీటుకోసం ప్రయత్నాలు చేశాడు. సీటు దొరికింది. శ్రద్ధగా చదవడం ప్రారంభించాడు.

* * *

"ఏమిటి ఆలోచిస్తున్నారు ?" నీరసంగా అడిగింది రాధ.

"గతం."

ఆమె పేలవంగా నవ్వింది.

"మన కథ చాలా చిత్రంగా నడిచింది రాధా ! మూడేళ్ల క్రితం సన్నివేశాన్ని గుర్తు చేసుకుంటూంటే అంతా తమాషాగా, ఆశ్చర్యంగా అనిపిస్తోంది. మన ప్రమేయం లేకుండానే జరక్కూడనివన్నీ జరిగిపోయాయి కదూ."

"నాకోసం మీరు బాగా శ్రమ తీసుకుంటున్నారు."

"ఇది నా విధి."

"దురదృష్టం పగబట్టిన పాములా నన్ను వెంబడిస్తోంది శంకరం ! .... చావు నా కోసం చేతులు చాచుకూర్చున్నదని నాకు తెలుసు...."

"రాధా .... ఏమిటా మాటలు."

"ఎప్పుడైనా—ఇలా జరుగుతుందని అనుకున్నావా ?" కళ్లనిండా నీరు నింపుకుంది.

"ఇక మాట్లాడకు రాధా .... నీకు విశ్రాంతి అవసరం."

శంకరంవైపు పిచ్చిగా చూడటం మొదలు పెట్టింది రాధ.

"ఈ మందు తాగి నిద్రపో .... ఇలాటి రోగాల నెన్నిటినో బాగుచేస్తున్నారు ఈమధ్య. ధైర్యంగా ఉండు." అతను రాధచేత మందు తాగించాడు. మెల్లగా అక్కడనుంచి లేచి బయటి కొచ్చాడు. అప్పుడే మాస్టారు యింట్లోకి వస్తున్నారు. శంకరాన్ని చూచి మళ్ళా తల వంచుకుని, రాధ గదిలోకి వెళ్లిపోయారు.

శంకరం నిట్టూర్చాడు !

పాపం మాస్టారు కూడా చిక్కి శల్యమైపోయారు. ఆనాటి కళాకాంతులు ఆయనలో మచ్చుకైనా కనిపించడంలేదు.

వీధి అరుగుమీద కూర్చుని సిగరెట్టు ముట్టించాడు శంకరం. మళ్లా గతం కళ్లముందు తిరగడం ప్రారంభించింది.

(సశేషం)





# న్యూఢిల్లీ లేఖ

7—పేజీ తరువాయి

లనే వంత పాడేరు. కాని, నాయకుడు శ్రీ రంగా మాత్రం అస్సలేం జరుగుతుందో తాను ఎరగ నట్లే నటించారు..

ఇప్పటి దేశైక్యత ప్రమాదభరితంగా ఉంది. ఇది అగ్ని రగుల్కొల్పవచ్చును. దీన్ని పరిష్కరించి తీరాలి. ఇది హిందీకి యింగిలీషుకే కాదు. హిందీకీ, దేశైక్యతకూ సంబంధించిన సంగతి. ఒక్క ప్రజా సోషలిస్టు పార్టీ మాత్రం గట్టిగా యీ "మంద లించాల" నే తీర్మానాన్ని బరలపరచింది.

వాస్తవంగా ఆలోచిస్తే, యీ హిందీ పేచీ చాలా సంకుచితమైనది.

హిందీ, యింగిలీషుల మధ్య వాగ్వివాదం కాదిది. అధ్యక్షునిగా ఎన్నికైన వ్యక్తిని గౌరవించడం దగ్గర కలిగే మత్సరం యిది. కొన్ని రాజకీయపార్టీలు ఈ భాషా ప్రమాదాన్ని కేవలం రాజకీయంగానే గమనించాలి. దీన్ని రాష్ట్రపతి—పదవితో ముడి పెట్టుకోరాదు. ఈ భాషావాదం కేవలం రాజకీయ మైనది. రాష్ట్రపతి అన్ని రకాల రాజకీయా లకు అతీతుడు.

కాని, పై విషయానికి సోషలిస్టు నాయకుడు శ్రీ రాజ్ నారాయణ్ విముఖంగా ఉన్నట్లు తోస్తు న్నది.

**ఈ వివాదాన్ని ఆయన సుప్రీం కోర్టుకి తీసుకు వెళ్ళాలని చూస్తు న్నారు కూడా. పైగా దేశ వ్యాప్తంగా భారత రాష్ట్రపతి ఎప్పుడూ హిందీ ప్రాంతవాసుడై ఉండాలి అనే ప్రచారం కూడా ఈయన లేవదిస్తాడట.**

ఈ వైనం గమనిస్తూ ఉంటే, నాకు బ్రిటిష్ పాలకుల ఉద్యమం లేదా ఐక్య "భారత దేశం" 'పాకిస్తాను' అనే రగడా, జ్ఞాపకం వస్తోంది. పై రెండు సందర్భాల్లోనూ, మైనా రిటీలు, మెజారిటీవారి ఆధిపత్యాన్ని కాదన్నాయి.

హిందీ 'బ్లాకు' ప్రస్తుతం హిందీ భాషీయులు కానివారిని అణగ్రదొక్కాలని చూస్తున్నది. ఈ 'వర్గం' వారు యిప్పటికే చాలా రకాల ఉద్యోగా లను సృష్టించ గలిగారు. వేలకొలది తర్జుమా దారులు తయారయ్యారు.

ప్రభుత్వంలో తర్జుమాకారుల సంఖ్య చాలా ఎక్కువగా అవుతున్నది. మూడు భాషలు నేర్పే విద్యావిధానం హిందీవారికి అనుకూలంగానే ఉంటుం దని చెప్పవచ్చును. ఎందుకంటే వారు ఒక్క యింగిలీషు నేర్చుకుంటేనే చాలు. కాని హిందీ వాదులు ఒక్క విషయం నేర్చుకోవాలి. యుద్ధా నికి ముందు కూడా భాషను బలవంతంగా ప్రజల నెత్తిన రుద్దడం సాధ్యపడలేదు. ఒక్క నిరంకు శత్వంలోనే అది సాధ్యపడుతుందేమో.

ఒకప్రక్క దేశం చైనా దురాక్రమణకు వ్యతిరే కంగా ఎదురు సన్నాహమవుతూవుంటే, సోష లిస్టులు హిందీ భాషేతరులపై విరుచుకుపడాలని ఆయత్తమవడం శోచనీయమైన సంగతి.

కేవలం హిందీ భాషాప్రాంతంనుంచే ఈ దేశా నికి రాష్ట్రపతిని నిర్ణయించాలి అనే విషయం దేశైక్యతకూ దెబ్బ; 'హిందీ' కి కూడా దెబ్బ!

అదృష్టం ఏమిటి అంటే, అధికారంలో ఉన్న పార్టీ మాత్రం యింకా జాతీయ సమైక్యత అంటున్నది. అంచేత ఈ పైన పేర్కొన్న ఉద్య మమే గనుక ప్రారంభం కాబోతూవుంటే అరికట్టి తీరాల్సిందే.

* * *

బాబూ రాజేంద్రప్రసాద్ అస్థికలు నిమజ్జ నార్థం, న్యూఢిల్లీ నగరానికి తీసుకొచ్చారు. సాధా రణంగా జరిగే అంత్యక్రియల్లో దీనికి ఎక్కువ ప్రచారం మన దేశంలో ఉంది. మరణించినవారి అస్థికలను గంగానదిలో కలిపితే ఆ మృతుల ఆత్మలకు పవిత్రమైన ఉత్తమలోకా లందుతాయని హిందూ సంప్రదాయం. ఈ గంగను భూమిమీదికి భగీర థుడు తీసుకువచ్చాడు. తన పితరులను ఉత్తమ లోకాలకు పంపేందుకోసమని ఆ గంగమ్మను దివి నుండి భువికి దిగి రమ్మంటే, ఆమె తన భారం భూమికి భారమై పోతుంది కనుక తనను భరించ వహించేందుకు పరమశివుని శరణు వేడుకోమనగా, భగీరథుడు మళ్లీ వుక్కరంపాటు తపస్సుచేసి పరమ శివుని మెప్పించగా, మహాదేవుడు గంగను జడలో బంధించి ఒక పాయమాత్రం భూమిమీదకు పంపిం చాడని మన పురాణాల్లో ఉంది. మృతజీవులకు సరా సరి స్వర్గద్వారాలు తెర్చుకోవాలంటే, పుణ్యప్రద మైంది గంగానది దీని నమ్మకం.

స్వర్గీయ పటేల్ వారసులు పటేల్ అస్థికలను అలహాబాద్ తీసుకువెళ్తూ ఆయన వారసులు ఢిల్లీ వచ్చారు. సాధారణంగా గుజరాతీ కుటుంబా లలో అస్థికలను వారణాశికో, ప్రయాగ (అలహా బాదు)కో తీసుకువెళ్తూంటం అలవాటు. స్వర్గీయ మావులంకర్ అస్థికలను ఆయన వారసులు యము నలో కలిపేందుకు ఢిల్లీకి తీసుకువచ్చారు.

డా. రాజన్‌బాబు అస్థికలను వారణాసి, ప్రయాగ లలో కలిపిన తర్వాత న్యూఢిల్లీలో యమునలో కలిపితే బాగుండేది. పైగా ఈ అస్థికల కోసం సైనికరీతులలో మళ్లీ ఓ అంత్యక్రియ ఏర్పాటు చేయటం జరిగింది!

* * *

పురపాలక వ్యవహారాలలో అనుభవం గడించిన రాజకీయవేత్త బాబా బిచ్చిత్తర్‌సింగ్, యిటీవల పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ నగర పాలక వ్యవ స్థకు చెందిన నిర్మాణశాఖతో చేతులు కలిపి, ఒక కూటమిగ ఏర్పడి సుమారు 50,000 అనధికార నిర్మాణములను ప్రోత్సహిస్తున్నవాళ్లు నగరపాలక సంఘసభ్యులే కాని వేరే ఎవరూ కాదన్నారు. ఎన్నిక లైన వెంటనే జనం గుడిసెల్లో, గుడారాలలో తిష్ట వేసుకూర్చుని, ఎవరన్నా అడిగితే కార్పొరేషన్ ఎన్నికలో పోటీచేసిన అభ్యర్థు లందరు, తమకు ఉచిత స్థలదానం వాగ్దానం చేశారని అన్నారు.

ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనం నిర్మూ లించేందుకు ఏర్పడి, శ్రీ కె. సంతానం అధ్వర్యాన ఏర్పడ్డ సంఘంను నియమించిన ప్రభుత్వం కాంగ్రెసు సభ్యులు చేసే చెడు మార్గాలకు ప్రోత్సాహం ఇస్తున్నది. ఇలా అంటానికి కారణ మేమంటే, ఈ పుకారును ప్రభుత్వం ఖండించనూ

---

# రాజధాని కబుర్లు

9-వ పేజీ తరువాయి

తారు" అని చెప్పాడుట ఆ జ్యోతిష్కుడు, నింపా దిగా సమాధానం! ఏ కొత్తయినా నాలుగు రోజు లుంటుంది; అంతేగా! ఈ నగ్నసత్యం అందరికీ తెలుసు. సమయానికి అందరం మరిచిపోతాం. ఇదే తమాషా!

ఏమయినా ముందు వెనుకలు ఆలోచించి గత సంవత్సరంలో సంభవించిన అపజయాలకు కారణా లేమిటి? ఇప్పుడు దిద్దుబాటు చేసుకుంటూ ముందు కెట్లా సాగిపోవాలి అనే విషయాన్ని దృష్టిలోకి తెచ్చుకోవాలి. 'సక్సెస్' రాకపోవటానికి కారణాలు ఏకరువు పెట్టొచ్చేమో గాని, జయం పొందా లంటే, ఏం చేయాలి అనేది యిదమిత్థంగా చెప్పటం కష్టమేమో! ఏమైనా ఎప్పుడో ఒకప్పుడు జీవితపు జమాఖర్చుల లెక్కలు తేల్చుకోవడం అవసరమే! రాబడికి, ఖర్చులకు లంకెపెట్టి, రాబడిని తప్పించు కొని ఖర్చులు పరుగెత్తుకుపోకుండా ఉండేటట్లు చూడాలి. నూతన సంవత్సరంలో ప్రప్రథమ **ప్రమాణం అప్పు చెయ్యకూడదనీ అని ఉంటే** బాగుంటుంది. అమ్మో! పెద్ద చిక్కే తెచ్చి పెట్టారు. అప్పే చెయ్యకపోతే అన్నం తినేదెట్లా అంటే సమాధానమేమీ దొరకటంలేదు. అసలు అప్పు తీర్చటానికే మానవుడు మళ్లీ జన్మ ఎత్తు తాడు అనేది ఒక సిద్ధాంతం. తీర్చాలసిన అప్పు తీర్చలేక ఇంకా యింకా చేసి, మళ్లీ మళ్లీ జన్మలు ఎత్తుతూనే ఉంటాడు. దీనికి అంతంటూ ఉండదు. అప్పుకు యిలాంటి ప్రామాణిక స్థాయి ఉన్నప్పుడు అప్పు చెయ్యకూడదని సిద్ధాంతీక రించటం తప్పేమో! సరే, కానీండి. కనే కోడలే ఉంటే, వద్దనే అత్తగా రుంటుందా! ఈ శాస్త్రం ఏనాటిదో, ఎలాంటి సందర్భాలలో ఎవ్వరికి అన్వ యించారో ఏమో, యిప్పటి పరిస్థితుల్లో, సుతరాం అసలు చెయ్యకూడదు. ఏకకాలంలో కనే కోడలు, **అత్తగార్ల విషయాలు వదిలేస్తే, సంతానోత్పత్తికి** సంబరపడాల్సిన అవసరంలేదూ అని ఓ నిశ్చ యానికి రావచ్చు. ఈ ఏడాదికి, పాప్యులేషన్‌కు మన కంట్రిబ్యూషన్ ఏమీ ఉండకూడదూ అను కుంటే, ఎట్లా ఉంటుంది. దీన్ని కొత్త సంవత్స రంలో సీరియస్‌గా ఆలోచించాల్సిందే! అయితే పెద్దలు హర్షించక పోవచ్చును. అయినా ఎవరి బాధలు వారివి! ఖర్చులు తగ్గించుకుని, పొదుపుగా వాడుకోవటం అలవాటు చేసుకుంటామా అంటే, ఖర్చులకే సరిపోకపోతే యింకా మిగిల్చే దేమిటి అంటారు. నడుంవంచి కష్టపడి పనిచేస్తానని శపథం చేస్తే ఏం! మరి అనాదిగా అలవాటుపడ్డ సోమరితనం మాటో అంటారు! ఇదీ నిజమే! ఒక్కరోజులో పోయేదా! దేని విషయం చూసినా ఏవో చిక్కులే కనిపిస్తున్నాయి. మరి ఏమిటి ఈ కొత్త సంవత్సరంలో ఎలాంటి ప్రమా ణాలు చెయ్యాలి అని మిస్టర్ శ్రీనివాస్‌ను అడిగితే ఏ ప్రమాణమూ చెయ్యనని ప్రమాణం **చెయ్యమని సలహా యిచ్చాడు. బి. ఎల్. ఎన్.** ★

# న్యూఢిల్లీ లేఖ

లేదు; ప్రభుత భూవుంనిఅక్రమంగా ఆక్రమించి తిష్ఠ వేసుకుని ఎలాంటి ఉపద్రవం లేకుండా హాయిగా ఉంటూన్న ఆసామీలకూ వారిని తొలగించే చర్యల ప్రభుత్వం తీసుకోవాలేదు.

బాబా బచ్చితర్ సింగ్ కూడా కాంగ్రెస్ సభ్యుడే మరి! ఆయన వెల్లడించిన విషయాలు, నగర పాలక సభ్యుల్లో చాలా గగ్గోలును లేవనెత్తాయి. బహిరంగ నిష్పాక్షిక విచారణ జరిపించమని బాబా సాహెబ్ విరోధులు కోరివుంటే ఆయన ప్రశ్నకది సమాధానమయ్యేది. అలా చేయకుండా గోల చెయ్యటంవల్ల, వారు ఆయన చెప్పిందే నిజమనే వాదాన్ని పరోక్షంగా బలపరచినట్లయింది.

ఇది ఇలా ఉండగా, ఢిల్లీ నగరానికి ప్రజాస్వామ్య వ్యవస్థకు ప్రయత్నాలు ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. ఇంకో ప్రక్క కొందరు కేంద్ర మంత్రులమీద వచ్చిన ఆరోపణలు ఇళ్లల్లో చర్చకు వస్తున్నాయి! మన ప్రధాన మంత్రి సరేసరి! ఇలాంటి చిన్న విషయాలను ఆయన లెక్క చేయనే చేయరు. రాజకీయవేత్తలలో పెరిగిన అవినీతి తత్వంను నిరోధించేందుకు ఆయన బలం చూపించలేదు కూడా!

ఒకమాటలో చెప్పాలంటే మన పద్ధతి అచ్చు అమెరికన్ పద్ధతే. బ్రిటన్ పద్ధతి మాత్రం కాదు. కారణ మేమంటే, అమెరికాలో ఒకానొక అధ్యక్షుని అంతరంగిక కార్యదర్శి షెర్మన్ ఆడమ్స్ పైన కొన్ని అభియోగాలు వచ్చాయి, పత్రికలన్నీ చేరి మూకఉమ్మడిగా దుమ్మెత్తి పోసిన తర్వాతనే షెర్మన్ ఆడమ్స్‌ను ఇంటికి పంపించారు.

మరి బ్రిటన్‌లో!. స్కాట్‌లాండ్ యార్డ్ నివేదిక ఆధారంగా ప్రముఖ్య మంత్రి ఉపముఖ్యమంత్రి పైన విచారణ జరిపేందుకు ఒక న్యాయవిచారణసంఘాన్ని నియమించాడు. ఈ నిష్పాక్షిక విచారణలో ఆఫలానా ఉపమంత్రిగారు ఒకానొక షరాబు వారి దగ్గర్నుంచి ఓ అరడజను 'ముష్టి' విస్కీ సీసాలు పుచ్చుకున్నాట్ట! అందుకని ఆ మంత్రివర్యుని, బహిరంగంగా విమర్శించటం, పార్టీ నుంచి తొలగించటం కూడా జరిగాయి. రాజకీయమైన నిష్ఠను రక్షించుకునేందుకు బ్రిటన్ ఎలా ప్రవర్తించి విజయంపొందిందీ తెలపటాని

# సరాగమాల

వి ఎ కె రంగారావు

ఈ పాటికి శ్రీరామనవమి ఉత్సవాలు దేశమంతటా కన్నుల పండువుగా, కర్ణపేయంగా జరుగుతూ ఉంటాయి. కొన్నిచోట్ల తొమ్మిది రోజుల వేడుకలు శ్రీరామనవమితో ముగుస్తాయి. కొన్నిచోట్ల నవమినాడు మొదలై నవరాత్రులు సాగుతాయి. బుర్రకథలు, హరికథలు, నాటకాలు, పాట కచ్చేరీలు, ఆటకచ్చేరీలు ఈ తొమ్మిది రోజుల్లో జరిగినంత ఒక్కుమ్మడిగా ఆంధ్రప్రదేశంలో మరెప్పుడూ జరుగవు. వీటన్నిటిలో కూడా రామకథకు యొక్కువ ప్రాముఖ్యత సహజంగా ఉంటుంది.

రామ కథ సినిమాలలోనూ ఎన్నోసార్లు వినబడింది.

"ఏమి రామ—కథ శబరీ శబరీ
ఏదీ మరియొకసారి."

"భక్త శబరి" లో పెండ్యాల, దేవులపల్లి, శ్రీనివాస్, సుశీల కలసి చేసిన సంయుక్త కృషి సద్యః ఫలం. ఇందులో రాముడు

"వాలు కనుల ఆ జానకిని
ఓర—గనుల ఒకసారి గని"

నంత నుంచి "జానకి యేమాయె" నని అడరినంతవరకు ఉన్న రామ—కథ వర్ణితం. కృష్ణశాస్త్రి కవనం యెంత సులభంగా, మృదువుగా ఉందో పెండ్యాల సంగీతం అంత లలితంగా, మృదులంగ ఉంది. పల్లవి జైజైవంతిరాగం తరువాత రాగమాలిక. శ్రీనివాస్ పాడిన మొదటి భాగంలో యెంతటి ఆనంద తన్మయత్వం కనిపిస్తున్నదో, సుశీల పాడిన రెండవ భాగంలో అంతటి భక్తి పారవశ్యం కనిపిస్తున్నది. రికార్డు నంబరు జి. ఇ. 35072.

రామాయణ—కథ కొద్దిగానో, గొప్పగానో చిత్రలలో వినిపించటం ఈ "భక్తశబరి" నాటిది కాదు ఎప్పుడో వచ్చిన "నా యిల్లు" లో కూడా ఉన్నది అది కూడా శ్రీ దేవులపల్లి రచనామృతమే.

"విన్నారా జనులారా వీనులార శ్రీరామ కథ
శ్రీ దశరథరాముని దివ్య కథ"

ఈ చిన్ని పాటలో రెండే ఘట్టాలు వర్ణింపబడినవి.

"మనసార వలచి, శివధనువు విరిచి
వనిత జానకిని చేపట్టిన" ఈ ఘట్టమూ
"క్రూర రావణుడు కారడవులలో
చేరి జానకిని కొనిపోగా
ఘోరమైన దుఃఖములో
'హా సీతా హా రామా'
అని వాడ యెంతో అల్లాడిపోయిన" ఘట్టము.

నాగయ్య రాగమాలికగా మలచిన ఈ పాటను బాలసరస్వతి, జిక్కి పాడారు. ఈ పాట బాణీ చాల తేలికైన పాణిలోనే ఉంది. జిక్కి, బాలసరస్వతులు తమ కంఠాలు సరిగ్గా మేళవించి ద్వయ దివ్య వివంచికలా పాడారు. ఈ రికార్డు యిప్పుడు కాపీ అయింది.

రామాయణ గాథలో సాధారణంగా రాముని పొగడ్త ఉంటుంది. అలా కాక, రాముని తెగనాడటం కూడ ఒక పాటలో ఉంది. "ఆలుమగలు" చిత్రంలో సన్నివేశాన్ని బట్టి ఆత్రేయ ఆవిధంగా వ్రాశారు. వితండవాది యెప్పుడూ తన వెనుక తర్కాన్ని తోడు తెచ్చుకున్నట్లే, ఈ పాట రచనలో వీరి కలమూ తర్కాన్ని ఆసరా జేసుకొనే నడిచింది.

"జననీ వినుమా రామచంద్రుడు
జననాథుడు కాడు — సజ్జన పూజ్యుడు కాడు
తల్లీ ఆతడు ధర్మదూరుడు — దయారహితుడు చూడు.
ఎవరో వేసిన నిందను నమ్మి — యింగితమే విడనాడి
ఎరిగిఎరిగి చూలాలిని అడవికి—తరిమివేసినాడు
—తా కరుణ బాసినాడు
వరించి పరిణయమాడిన సతిని—తనతో అడవికి తరలిన కాంతను
అగ్నిపరీక్షకు ఆగిన తల్లిని—విచారించక విశదము తెలియక—విడనాడినవాడు.
పాశము తెగదెంచినవాడు
మానవు డాతడు కాడమ్మా మనసులేని మగవాడమ్మా."

రచన యింత అందంగాను, అర్థవంతంగాను ఉన్నా, అఖిలాంధ్రజన మనోభిరాముడిని దుర్గుణాభిరాముడనే నింద వేసినందుకు ఈ పాటకు సంగీత సాహిత్యాల దృష్ట్యా రావలసినంత రాణింపు రాలేదు. రికార్డుగా కూడా విడుదల కాలేదు. కె. వి. మహాదేవన్ సంగీతం, ఎల్లారీశ్వరి పాడటం—రెండూ బాగానే ఉన్నాయి.

రామాయణం పూర్తిగా (ఉత్తరకాండ మినహా) గేయ రూపంలో ఉన్న చిత్రాలు మూడే "భూకైలాస్", "వాల్మీకి", యిప్పుడే విడుదలైన "లవకుశ". ఈ లెక్కలో డబ్బింగ్ చిత్రాల ప్రసక్తి లేదు. ఈ మూడింటిలో సాహిత్యంలో సౌలభ్యం, సౌకర్యం, పరాకాష్ఠ నందుకున్నవి. "భూకైలాస్" రామాయణ గానంలో సముద్రాలవారి కలమే, మొదటిసారియే విశిష్టమైన పద్ధతిలో విలక్షణమైన అంశంతో ప్రారంభమవుతుంది.

"ద్వారపాలుర మరల దరి దీయు కృపయో
ధరలోన ధర్మమ్ము నెలకొల్పు నెపమో"

అని కారణం ఊహిస్తూ, "రాముని అవతారం" అనే చరణం మొదలవుతుంది. ఈ పాటలో రచన సాగినంత క్లుప్తంగా, రమ్యంగా మరే రామ గాథలోనూ సాగలేదు. ఇదీ రాగమాలికే. సంగీతం ఆర్పుదర్శనమ్, ఆర్గోవర్ధనమ్. పాడింది ఘంటసాల. అసలు యిటువంటి దీర్ఘమైన పాటలకు వారిది పెట్టింది పేరు. ఆ పేరు పెట్టడం ఈ పాటవలనేమో అనిపించేంత గొప్పగా ఉంది వీరు పాడటం నంబరు జి ఇ. 32167



'కానిస్టేబులు కూతురు'లో ఒక దృశ్యం. (రూప)

ఘంటసాల పాడిన రామాయణమే, సముద్రాల రచనే "వాల్మీకి" లో కూడ ఉన్నది.

"శ్రీ రామాయణ కావ్య కథ జీవన తారక
మంత్ర సుధ"

అనే రచన పైదానంత సుకరం కాకపోయినా, సాహిత్య విమర్శలో దాని కేవిధంగానూ తీసిపోదు. ఈ పాటకు సంగీతం సమకూర్చింది ఘంటసాల. ఇందులో వరుసగా దేసి, మోహన, శ్రీరంజని, హంసానంది, చారుకేసి, సింధుభైరవి, భూపాలం, కమాస్, మధ్యమావతి, తిలాంగ్ వకుళాభరణం, శేఖరచంద్రిక (శుభపంతు వరాళిజన్యం) హిందోళం రాగాలు మాలికగా వినిపిస్తున్నాయి. గమనించతగ్గ



"చదువుకొన్న అమ్మాయిలు"లో వర్ధమానతార ఇ. వి. సరోజ.



'పరువు ప్రతిష్ఠ చిత్రం'లో ఒక దృశ్యం

# సరాగమాల

ప్రత్యేకాంశాలు: (1) ఆ యా రాగాలను చరణాల తరువాత వినవచ్చే పల్లవి దేశిలోనుండక ఆ చరణం రాగంలోనే వస్తుంది. (2) గుహుడు సీతారామలక్ష్మణులను నదిని దాటించిన చరణం, భరతుని పాదుకాభ్యర్థనం చరణం ఆ యా రసాలకు తగిన భూపాల రాగంలో ఉన్నవి. (3) శూర్పణఖ రాముని కామించిన చరణం జావళులకు ప్రసిద్ధి చెందిన కమాస్ రాగంలో ఉన్నది. పై రాగాల క్రమాన్ని గమనిస్తే తెలిసినట్లు ఈ పాటలో భక్తి భావానికన్నా సంగీత శాస్త్రానికే ప్రాముఖ్యత. ఈ పాట రెండు రికార్డులుగా విడుదలైనది. N. 69757, 69758.

"లవకుశ"లో రామాయణ గాథకు చెందినవి మూడు పాటలు ఉన్నవి. "రామకథను వినరయ్యా" అన్నది హిందోళ రాగంలో ఉన్నది. "వినుడు వినుడు" అనేది పీలూ (కల్యాణికి దగ్గర)లో ఉంది. "శ్రీరాముని చరిత" మనేది శివరంజనితో మొదలయ్యే రాగమాలిక. వీటికీ సంగీతం ఘంటసాలే. పాడినది సుశీల, లీల. రికార్డు నంబరు జి. ఇ. 35350, 35351. ఈ మూడు పాటలలో కూడ సాహిత్యాని కన్నా, సంగీతానికి యెక్కువ ప్రాముఖ్యత యివ్వబడింది.

దాదాపు యిరవై—అయిదేళ్ల క్రిందట వచ్చిన "లవకుశ"లో కూడ ఒక పాట ఉండేది:

"రఘురాము చరితమును వినుమమ్మ ఇహ
రాముని సీతారాముని దలచిన పాపము తొలగు
నుగా."

పాడిన యిద్దరిలో ఒకరు మాదవరపు మల్లేశ్వరరావని గుర్తు. అంటే యిటీవలి "దక్షయజ్ఞం" మొదటిలో హరికథ చెప్పిన వ్యక్తి. ఆ వంతపాడిన రెండవ కంఠ మెవరిదో, పాటను వ్రాసినవారెవరో వరస—కట్టిన వారెవరో పాఠకులు తెలిస్తే తెల్పుతారా ?

1945 ప్రాంతాలలో ప్రకాశ్‌వారి హిందీ చిత్రం "రామరాజ్య" విడుదలైంది. ఉత్తర దేశంలోనేకాక, యావద్భారతదేశమంతటా విజయభేరి మ్రోగింది. అందులో వాల్మీకి పాడిన రామాయణ గాథ "సునో భరత్‌కీ"అనే పాటను తెలుగులోకి "భారత సాధ్వీమణి పావనచరిత కథా యిదే వినుడు" అని అనువదించి హెచ్. ఎం. వి. వారు మల్లిక పాడగా, విడుదలచేశారు; ఇప్పుడు దొరకదు.

ఇటీవలనే వచ్చిన "వాగ్దానం"లో శ్రీ రామాయణంలోని శ్రీ సీతాకల్యాణ సత్కథాఘట్టం హాస్య భక్తి రసాల ఉత్తమ కలయికగా వినవచ్చింది. దాని నంబరు ఎన్. 69689. ఈ పాట అంత జనాదరణ పొందటానికి కారణం ఘంటసాల పాడటం, పెండ్యాల ఫక్కు—హరికథల మెట్లు పెట్టడమేకాక తెరపై రేలంగి నటన, సూర్యకాంతం ఫిడేలు వాయించటం కూడ చాలావరకు తోడ్పడినవి.

* * *

ఇక సమాధానాలు

ప్రయణ గుప్తులని పిలువబడే పెన్నేపల్లి గోపాలకృష్ణరావు నాయుడుపేటనుంచి ఇలా వ్రాశారు "…. పాడినది రాధే; కాదు కాదు భానుమతి. ఎంత చక్కని వాక్యం వ్రాశారూ! భానుమతి పాటకు ఇంత సరయిన వాఖ్య మరెక్కడా వినలేదు; లేదు కూడాను. ఎన్నో రోజులనుంచి అనుకుంటున్నాను. భానుమతి గాత్రాన్ని ఎలా పోల్చాలా అని, మరొకలా

అనలేక 'అలా పిడేవాళ్ళు' మరొకరు లేరనేవాణ్ణి. అన్నాళ్ళకు మీనుండి చక్కని భాష్యం విన్నాను. ఆమె పాటను సరిగ్గా తూకంవేసే మాటలు; యువి.మీ సరాగ మాల వ్యాసాలన్నీ ఒకయెత్తూ; ఈ ఒక్కవాక్యమే ఒక యెత్తున్నూ. అభినందనలు." అని అందుకోవలసి నది భానుమతికాని, నేనుకాదు. ఆ ఘనత ఆమెది. ఆ మాట అనగలిగిన గౌరవం మనది. "భానుమతికి ఇదొక గొప్ప అవార్డు. ఆమె చదివేలా చేయండి." చదివేలా చేయంటే చనువు నాకు లేదుగాని, మీరన్న మాటతో నేను యేకీభవిస్తానా చదవడమంటూనికి ?, భానుమతి కూడ యేకీభవిస్తారని అనుకోను. కావ్యానికి, అర్హతకు, స్త్రీస్వరూపమైన రాధని సంబోధనకన్నా అందమైనది, అందుకు తగిన అహంభావం కలది, అనుగత పతియైన పతి గలది మాధవుని ముద్దుల ప్రేయసినని తీయని భ్రమలో మున్నది అయిన సత్యభామ అంటేనే భానుమతి గారికి నచ్చుతుందనుకుంటాను. అయినా కాక పోయినా, ఒకరన్నమాట భానుమతికి అవార్డు అవు తుందా ? చకోరి ఆనందమే చంద్రికకు మాధుర్యం ప్రసాదించినప్పుడు, పద్మినీ వికాసమే భాస్కరునికి ప్రభలనిచ్చినప్పుడు, గొల్లపిల్లల మనోల్లాసమే ఆ నల్లనానికి క్రీగంటిచూపులో చల్లదనమైన పుడు, ఒకరి మాటలు భానుమతి కంఠానికి వెలుగు నిస్తాయి.

సోమవరపు సీతానగరంనుంచి ఆంధ్ర కూర్మా రావు: "ఇంతిరో పాటలో, భావలాలిత్యం పదలాలిత్యం వద్ద పోటీ పసందుగా వుంది. కాని, జానకి కంఠ మాధుర్యం వాటిని అధిగమించి విన్నవారి హృదయా లలో మధురతర భావాలను వేణుగానలోలుని లీల లను సువిరింపజేసింది. ఈ అద్భుత గాన సృష్టికి అభినందించవలసినది మధుర భావైక్యత పొంది, జాను తెనుగు బాణీ వినిపించిన ఆనందకుమార్‌నా ? గీతానికి జీవంపోసిన జానకినా ?" వరస కట్టిన అంతరాత్మ గురించి మరచారేం ! ఆ అంతరాత్మ మీ అంతరాత్మ అనుకునే అంతరాత్మకాదు. మీ అభి నందనలు ఆనంద్‌కుమార్‌కి తెలియజేయుగా శ్రీ మల్లాదివారి ఆశీర్బలం అన్నారు. " 'ఓ్ంతిరో' అని ఆపి, మళ్ళా అనడం హృదయం ఒక్కసారి ఆగిందా అనిపిస్తుంది. రెండవ పాటలో 'అనురాగమే నీ విందు జేసె' అని శృంగార భావనలో ఉత్కృష్టమైన రూపకల్పన చేశారు." మల్లాదివారి ప్రభావం ఉం దని నేనన్నానే కాని,కవి (అప్పటికి) ఆమాట అనలేదు. అయినా మనం ఊహించుకోవచ్చును; పారిజాతా లకు ఆ దివ్యపరిమళం శ్రీ కృష్ణుని—స్పర్శతోనే వచ్చిందని, ఆ వారి సరాగమాలే కాదు; ప్రతి సరాగ మాలా సాధారణంగా నా స్వరాగమాలే. నాకు నచ్చిన రాగాల గురించికాక, నాకు నచ్చని వాటిగురించి ఎందుకు వ్రాస్తాను. ఏమని పరిచయం చేస్తాను ? కాబట్టి మీరు చేసిన 'స్వరాగమాలవే చమత్కార ప్రయోగం ఆరోపణకాదు; చిన్నమాట. నిజంగా నా వ్రాతలు పరిశీలిస్తున్న వారందరికీ సంవత్సరం బట్టి తెలుసున్న మాట.

రేగులపాడు వేణుగోపాలరావుగారికి : 'మన మోహన', "[illegible]దారి"లో లీల పాడిన పాట; సంగీతం [illegible]. ధనవ మల్లాదివారికి ధన ఉంటాము.

★

# ఆవీ - ఇవీ - అన్నీ

## కొత్త సినిమా

బాబూ మూవీస్ వారి కొత్త చిత్రం 'మూగ మనసులు' ఔట్‌డోర్‌లో షూటింగు చేశారు. నరసాపురంవద్ద, ముక్తేశ్వరం అనే చోట గోదావరి తీరాన ఆమధ్య రెండు వారాలపాటు వీరు సెట్ వేసుకుని షూటింగు చేశారు. ఈ చిత్రంలో సావిత్రి నాగేశ్వరరావు, గుమ్మడి, సూర్యకాంతం మొదలగు వారు నటిస్తున్నారు. దర్శకత్వం ఏ. సుబ్బారావు; నిర్మాత : సుందరం.

## చిట్టిబాబు వీణకచేరీ

మద్రాసులో తెలుగు మహాజనసంఘంవారు (ట్రిప్లికేన్)లో ఉగాదినాడు శ్రీ చిట్టిబాబు వీణ కచేరి ఏర్పాటు చేసుకుని ఆయనను మాలవ వస్త్రాదులతో సత్కరించారు. శ్రీ చిట్టిబాబు ఈమని శంకరశాస్త్రిగారి శిష్యులు. చురుకైన యువకులు. ఏక బిగిన రెండు గంటలసేపు పిల్లలూ పెద్దలూ హర్షించే విధంగా శాస్త్రీయంగాను, జానపదంగాను కూడా ఉగాదినాడు వీణ వినిపిం చారు. పుర ప్రముఖులు, సంగీత ప్రియులు దీనిని విని ఆనందించారు.

## 'అనురాగం'

అమరూపావారు తీస్తున్న అనురాగం చిత్రాన్ని ఆంధ్రలో విజయావారు, నైజాంలో వాణీవారూ రిలీజు చేస్తారని తెలుస్తోంది.

దీనికి పెండ్యాల సంగీతం, రాజేంద్రకుమార్ సెట్ డిజైనులూ యున్నారు.



శ్రీయుత దామెర్ల శర్మ దంపతులు తమ కుమార్తె సౌ॥ లక్ష్మి వివాహం ఫిబ్రవరి 14 వ తేదీ నాడు మద్రాసులో వైభ వంగా చేశారు. వధూవరుల నిక్కడ చూడనగును.

## బొమ్మ 'పాత్ర'

బొమ్మై అనే తమిళ చిత్రంలో ఒక 'బొమ్మ' కథానాయకుని గన్న ముఖ్యమైన పాత్ర ధరించ బోతున్నది. ఈ చిత్రంలో ఎల్. విజయలక్ష్మి నటిస్తున్నది.

## 'ఆప్తమిత్రులు'

రాజరాజేశ్వరి ఫిలిమ్స్‌వారు మే నెలలో తమ ఆప్తమిత్రులను దేశంమీదకు పంపదల్చుకున్నారు. ఈ చిత్ర దర్శకత్వం శ్రీ నాగభూషణం వహిం చారు. సంగీతం: ఘంటసాల; కెమెరా : లక్ష్మణ్ గోరే వహించిన యీ చిత్రానికి మాటలూ, పాటలూ రాసినది శ్రీ సముద్రాల (జూ). నటీ నటులు : రామారావు, కాంతారావు, కృష్ణకుమారి, రాజసులోచన, లంక సత్యం మొదలగు వారు.



శుభోదయా వారి 'వారసత్వం'లో బాలసరస్వతి, రేలంగి, రామలింగయ్య.



చదువుకున్న అమ్మాయిలు'లో సరోజా, కృష్ణకుమారి, సావిత్రిలతో నాగేశ్వరావు.

# సోఫియాతో నాజీవితం

11-వ పేజీ తరువాయి

మీద ఆమెకి విపరీతమయిన మోజు. నాకేమీ అర్థం కావు కాని, ఆమెవెంట కచేరీలకి వెడుతూ ఉంటాను. ఒక సాయంత్రం న్యూయార్క్‌లో పెగ్గీలీ, ఇమ్మాన్యుయేల్ కచ్చేరీ ఒకదానికి డిసీకా, మార్‌యా మెర్కూడర్‌లతో కలిసి వెళ్ళాము. తెల్లవారుజాము 3 గం. కూడా కచేరి సాగుతూనే ఉంది. నాకేమో నిద్ర ముంచుకొని వస్తోంది. చలి విపరీతంగా ఉంది! సోఫియా ఉపయోగించుకునే 'బొచ్చుకోటు' ఒకటి ఉంటే వేసేసుకున్నాను. సోఫియా సంగీతంలో మునిగి పోయి ఇదేమీ గమనించనేలేదు. నేను అలాగే నిద్ర పోయాను. డిసీకా సంగతం నిద్ర ఆపుకోలేక పోయాడు. సోఫియా మాత్రం సంగీతానికి తాళం వేస్తూనే ఉంది.

"సోఫియా స్వభావానికీ, నా స్వభావానికీ చాలా భేదం ఉంది. పార్టీలంటే, వాటికి సంబంధించిన భోజనాలంటే నాకు విసుగు. ఇంటర్‌వ్యూలన్నా అంతే! (సోఫియా ఈ సంగతి వప్పుకోదు లెండి!) సోఫియాకీ యివంటే విసుగే కాని, నాలాగ బయట పడిపోదు. ఇవన్నీ అవసరం అంటుంది. ఆమెకి దీక్ష కొంచెం ఎక్కువే. ఆమె భావాలు స్పష్టమయినవి. ఆమె ధోరణి నిక్కచ్చిగానే ఉంటుంది. ఆమె కేది యిష్టం అయితే అది చేస్తుంది. ఆమెకి నేనొక మానేజర్‌ని కాదు. 'ది కీ' (The key) చిత్రంలో పాత్ర వెయ్యటానికి వప్పుకున్నప్పుడు నేను వద్దన్నా వినకుండా 'కాంట్రాక్టు' మీద సంతకం పెట్టింది. చిత్రం చాలా బాగా వచ్చింది. మేము అప్పుడప్పుడు వ్యతిరేకులం అవుతూ ఉంటాం కాని ఎప్పుడూ ఆమె చెప్పినదే నిజం అవుతూ వచ్చింది.

"నన్ను 'నన్ను' గానే స్వీకరిస్తుంది కాబట్టి సోఫియాతో జీవించడం అంటే నాకు చాలా ఇష్టం. నా దుస్తులను గురించి ఆలోచించే తీరిక సమయం ఉండదు నాకు. ఏవి 'స్టయిల్' గా ఉంటాయో నాకు తెలీదు. ఇవన్నీ సోఫియా చూసుకుంటుంది. నా 'టై' లన్నీ పారిస్ 'దియోర్' (Dior) నుంచి తెప్పిస్తుంది.

"రోజంతా పనిచేసి అలిసిపోయిన మేము, ఇంటికి వచ్చిన తర్వాత స్నేహితులను కొందరిని పిలిచి పేక ఆడుకోవటమో, టెలివిజన్ చూడటమో చేస్తూ ఉంటాం. మా వ్యాపారం దృష్ట్యా అవసరం అయి నప్పుడు తప్ప సినిమాకి వెళ్ళం. సోఫియా సినిమా లన్నీ నే నింకా చూడలేదు. సోఫియా కూడా తను వేసిన 'ఎల్‌సిడ్' (El cid) ని పూర్తిగా చూడలేదు.

"మాది ఒక చిన్న జట్టు—ఒక సెక్రటరీ, ఒక పనిమనిషి, ఒక హెయిర్ డ్రెస్సర్ (Hair Dresser), ఒక కారు డ్రయివర్ మాతో ప్రపంచంలో ఏ మూలకి వెళ్ళినా వస్తారు. సోఫియా తనంతట తనే 'రోల్స్ రాయిస్' కారు నడుపు కుంటూ వెడితే ప్రజలు విడ్డూరంగా చూస్తారు. కాని, ఈ కారుని మాత్రం నేను ఒకందుకే వాడు తాను—పటాటోపం అవసరం అయితే. రోమ్‌లో ఉన్నప్పుడు ఒక చిన్న 'ఫియట్' వాడుతూ ఉంటాను. తక్కినచోట్ల టాక్సీ తీసుకుంటాను.

"మేమేమీ విచిత్రమయిన వాళ్ళం కాదు. మా జీవితాలు కొంచెం వేరేగా ఉంటాయి అంతే. ఎందు కంటే, సామాన్య ప్రజలకు 'కల' లు నిర్మించే వారం కాబట్టి. అందరూ అనుకునేటంత రాక్షసులం కాదు. మా లక్ష్యం ఒకటే—అతి సాధారణమయిన జీవితం గడపాలని. దానిలో ఎంత అందం ఉందో చాలామందికి తెలీదు; తేలికయిన పని కాదు. అందులోనూ కొంచెం ప్రఖ్యాతి పొందినవారికి మరీ కష్టం. మావంటివారి వంక చూసేవారి కళ్ళలో ఒక ప్రశ్న కనిపిస్తూ ఉంటుంది : "ఈ ప్రపంచంలో మీకు ఇంకేం కావాలి ? దేనికోసం వెతుకుతున్నారు ?" మా సమాధానం—ఇవ్వగలిగితే: "మీ దగ్గరున్నదే మాకూ కావాలి, అంతే!"

"దురదృష్టవశాత్తు మా వివాహం చట్ట రీత్యా అంత మంచి పరిస్థితిలో లేదు.

"మామూలు జీవితం కావాలనడంలో అర్థం ఏమిటని మీ రడగవచ్చు. ఉదాహరణకి: ఆదివారాలు మేము గడిపే విధం తీసుకోండి. ఆదివారాలు బయటికి వెళ్ళం. మా వృత్తీ, దుష్ప్రచారాలూ, టెలిఫోన్ గంట మోతలూ, విమానాలూ, టెలిగ్రాంలూ—ఇవన్నీ మాకు దూరమయిపోతాయి. సినిమా వ్యక్తుల వృత్తికీ, కీర్తికీ ఇవన్నీ చాలా దూరం.

"మా జీవితం ఇంత కష్టతరం అంటే, దానికి మేమే కారకులం. ఇంకెవరినీ నిందించం. లాయరు వృత్తి మానేసి నిర్మాతగా మారిపోవటానికి నేనే కారకుడిని. మరొక విధంగా అయితే, సోఫియాని కలిసేవాడినే కాదేమో! ఇక సోఫియా సంగతంటారా ? అద్భుతమయిన ఆ నియాపొలిటన్ పిల్లకి ఒకటే 'లోపం—ప్రపంచంలోకెల్లా పెద్ద నటిగా అయిపోవటమే!"



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad.




*the **matte-mist** finish*
*of Max Factor face powder*

SO FEATHER LIGHT YOU CAN HARDLY FEEL IT ... SO BEAUTIFULLY BLENDED IT NEVER CHANGES COLOR OR PATCHES . . THE MATTE-MIST FINISH OF MAX FACTOR FACE POWDER, PERFECTED TO ENHANCE TODAY'S SUBTLE, SOFT MATTE LOOK.

# MAX FACTOR

SOLE SELLING AGENTS. T. T. KRISHNAMACHARI & CO. BOMBAY-CALCUTTA-DELHI-MADRAS



Aiyars MF 271